# పరీక్ష

జైనేంద్ర కుమార్



అనువాదం
'అయాచిత్'



విజ్ఞాన సాహిత్య వనం
బెజవాడ : సికింద్రాబాద్

సంపాదకుడు

చలసాని రామారాయ్.

ప్రచురణ – ౧౬

ప్రథమ ముద్రణ.

Q. H. P. I. C. 62 K. D.

ములుకోల ప్రింటింగ్ ప్రెస్, బెజవాడ.

# ౧

వకీలుపరీక్ష ప్యాసయినాడు కాని యింకా ప్రాక్టీసు ప్రారంభించలేదు. ఇందుకు కారణాలు రెండు. బి. ఏ. ప్యాసయిన పిమ్మట చెప్పలేము, టాల్‌స్టాయి, రస్కిన్, గాంధి వీళ్లలో ఎవరి విచార విస్ఫులింగము పనిచేసిందో, కాని అప్పుడు యల్. యల్. బి. పరీక్ష ప్రత్యక్షమైంది. దానిని చదవటం, ప్యాసవటంలోనే మగ్నమై పోయాడు. ప్లీడరీ పరీక్ష యిచ్చి, పట్నవాసాల లోని అలజడినుండి పల్లెటూరువచ్చి పడ్డాడు. లోపలి విస్ఫులింగము ప్రజ్వలించింది. ఇంతమట్టుకు ఆ భావము తీవ్ర రూపం దాల్చలేదు. లోలోపల నివురు కప్పిన నిప్పులా ఉండిపోయింది. అనుకూల వాతావరణం లభించే సరికి జాజ్జ్వల్యమానం అయింది. ఆలోచించాడు– ప్లీడరీలో ఏముంది? దేశముయొక్క సర్వనాశనము, ఆత్మయొక్క సర్వనాశనము ఈ రెండే – మరో సంఘటన కూడా తన భావాన్ని బలపరచింది.

గ్రామంలో తనకు కొంచెము జమీందారీ ఉన్నది, ప్రతిష్ఠా ఉన్నది. తన సౌహార్ద్దము కూడా ఇరుగుపొరుగు వాళ్లకు తెలియనిదికాదు. వాళ్ల కష్ట కష్టసుఖాలు తనతో చెప్పుకోటమూ కద్దు. ఒకరోజు ఒక విషయం అతని చెవుల పడింది. ఆవేశంలో బాధా పూర్ణమైన ఒక కర్తవ్యం అతనికి కనపడింది.

మున్షీ హోశియార్ బహదూర్ జిల్లాలో పేరు బడ్డ వకీలు. రాబడి [illegible] ఉంది – దాంతోపాటు పటా

కోపం కూడా. ఒక క్లైంటు వచ్చి అతనిని గూర్చిన చెడుగు వినిపించాడు.

క్రిమినలు కేసు. క్లైంటు చాలా విషమస్థితిలో ఉన్నాడు. మున్షీ చాలా ధైర్యం చెప్పాడు. ఫీజుకూడా నిశ్చయం చేసుకున్నాడు. తరువాత జ్ఞాపకం ఉండక పోవచ్చునని ఫీజు అంతా ముందే పుచ్చుకున్నాడు. కాని సరిగా వాయిదానాటికి మున్షీ గైర్‌హాజర్ అయ్యాడు. ఒకటి రెండురోజులు టైము యివ్వబడింది. కాని అప్పటికీ తీరిక గాలేదు. చివరకు ఒకరోజు మాత్రం గడువు ఇచ్చారు. నిజంగా మున్షీ ఆవేళకు వద్దామనుకున్నాడు. కాని టీపార్టీకోసం ఉండిపోవాలసి వచ్చింది.

పాపం! ఏబుద్ధినిఉన్నాడో క్లైంటు ఇంకోవకీలును ఏర్పాటు చేసుకున్నాడు, లేకపోతే ఏంకాను !

క్లయింటు భయపడుతూ మున్షీ దగ్గఱకు వెళ్ళాడు. ఎవరో అతన్ని గెంటేశారు. డబ్బురంగతి ! – డబ్బా ! చేతైతే వసూలుచేసుకోమన్నారు.

కాని ఎట్లా వసూలుచేసుకోటం? మొసలితో విరోధం తెచ్చుకొని నీళ్ళుఎలా తెచ్చుకోటం? న్యాయ స్థానంలో తనకు న్యాయం ఎలాజరుగుతుంది ?

సొంతంవిని నిశ్చయం చేసుకున్నాడు, ఏమైనాసరే, మున్షీకి పాఠం నేర్పాలిఅని. కొన్నిరోజులకు, పనిమీద పట్నానికి వెళ్ళవలసివచ్చింది. మున్షీ హుషారియార్ బహాదుర్ బాతుఖానాలో .. ఈజీఛైర్‌లో చేరగిలబడి గప్పాలు కొడుతున్నాడు. ప్లీడర్లంతా ఆయన

చుట్టూ ఉన్నారు.

సత్యధన్ యెకాయెకీ వెళ్ళాడు. మనవాడు (ఆదర్శవాదంలోపడి) తన పేరు సత్యధన్ అని పెట్టుకు న్నాడు! కాళ్ళకు నాటు చెప్పులజోడు కిర్రుకిర్రుమంటు న్నాయి. మొద్దుచొక్కా, నెత్తిమీద మాసిన పెడస రపు టోపీ. ప్లీడర్లంతా తలలెత్తారు.

వాళ్ళి పెడసరపు మనిషిలా ఉన్నాడే! మున్సీని గుర్తించాడో లేదో! సూటిగాతిట్టడం మొదలు పెట్టాడు. భాష ఇంగ్లీషు- వేషము దేశవాళీ - నిజానికి ఎవరికి ఆశ్చర్యం కలిగించదు!

సత్యధన్ కోపవర్షం వెలిసిన తరువాత

మున్సీ అడిగాడు— తమరెవరు ?

సత్యధన్— నేనూ ప్లీడరీ ప్యాసయాను.

సత్యధన్ 'ఆదర్శవాదం' లో బహుశా ప్లీడరీ ప్యాసయిన అహంకారానికి స్థానముండల్లేవుంది.

మున్సీ చిరునవ్వు నవ్వి అన్నాడు: " ఓహో! మీరు నాకు సన్నిహితులే! కోప్పడకండి! ... మరి యీ వృత్తే అటువంటిది."

"మన తప్పు వృత్తికి అంటగట్టితే?"

"ఓహో! తమరు హానెస్టు ప్లీడరుఅవుతారా? తప్పకుండా మ్యూజియంకు తగిపోతారు. ఇంతమట్టుకు ఇటువంటిజంతువును ఎవరూ చూచివుండరు."

సత్యధన్ కోపంమండిపోతోంది. అది నుళ్ళు నుళ్ళుగా గుడునుళ్ళు పడుతోంది.

"నేనంటున్నాను."

"చూడండి. వీరంటున్నారు."

"నేను చెప్పున్నా."

మాటఎగురకొట్టి మున్సీ అన్నాడు :

"ఏమిటి నువ్వుచెప్పేది, సీనెత్తి ?"

"నేను చెప్పున్నాను. నిజము"

"నిజానికీ, వకీలుకు సంబంధములేదు. నీకింకా తెలవదు. పసివాడవు. పిల్లకాకికేం తెలుసు ఉండేలు దెబ్బ? అయితే యుధిష్టిరుడవన్నాకా, లేదా వకీల న్నాకా. నిజం నిజం అంటే నువ్వుచెప్పేది అబద్ధమే!"

"అబద్ధము!"

సత్యాథన్ అనేశాడు : "అబద్ధములేకుండా ప్లీడరీ లేకపోతే నేనసలు ఈపనే చేయను."

"అచ్ఛా, అట్లాచెప్పు!"

ఇంతమందిలో చేసినప్రతిజ్ఞ ఎల్లాతప్పుతుంది? ప్రతిజ్ఞ నిశ్చయాన్ని పొందింది. ప్లీడరీ చేయడనేసంగతి వాడవాడలా ప్రాకిపోయింది. చదువుకున్న వాడు, పొట్టనుగూర్చిన దిగులు అట్టేలేదు. ఇక తనకు మిగిలినది జీవితంలో ఒక్కటే. 'ఆదర్శ ఆరాధనము.'

ఆదర్శమే అతని జీవితపరమావధి. దాన్తో అతనికి మత్తెక్కినట్లయింది.

ఒకరోజు బేకన్ పుస్తకము చదువుతున్నాడు. చదువుతూ చదువుతూ ఆపాడు. ఏదో ఆలోచనా పథ ములో పడిపోయినట్టు – దారితప్పి తిరిగివచ్చాడు.

ఆ పేజీ చింపివేశాడు. వెదకి ఒక తెల్లకాగిము తెచ్చాడు. సరిగా అక్కడ సరిపోయేటట్లు చింపి అతికించాడు. దానిమీద అందమైనఅక్షరాలలో ఇలా వ్రాశాడు.

'ఈ ప్రపంచము ఒక్కటి. ఇటువంటి అనేకమైన ప్రపంచాలలో ఒకటి. నేను దానిమీద ఒక తుచ్ఛ బిందువును – మరి అహంకారం దేనికి?

'ఈ కాలము ఎప్పటినుంచి వస్తోంది? దీనికి మొదలు లేదు – ఎప్పటిదాకా సాగిపోతుంది? అంతమనేది లేదు. ఈ అనాద్యనంతమైన కాలసాగరంలో ఆద్యంతములతో కూడిన నా జీవన బుద్బుదమునకు కూడా ఒకస్థానమూ! ఈ 50, 60, 100 సంవత్సరములు కూడా ఒక లెక్కయా? ఇంకా జీవనమంటే మోహము ....ఛీ... ఈ 50, 60 సంత్సరాల నా జీవితమువల్లయేమిటి ఉపయోగము? అంతంలేని ఈ బ్రహ్మాండంలో నా తుచ్ఛ 'అహం'కు ఏమిటి సార్థకత?'

క్రింద పెద్ద అక్షరాలతో వ్రాశాడు.

'తన' అనే భావాన్ని పోగొట్టుకొని ఈ అనంత సాగరంలో లీనమై పోవాలి. మట్టిలో కలసి భూమిని సమున్నతము చెయ్యాలి. భవిష్యత్తును బలమైన దానిగా చెయ్యాలంటే వర్తమానాన్ని నశింప చెయ్యాలి."

వ్రాసి తిరిగి చదివాడు. చదివినకొద్దీ రుచి నను భవించాడు. ఇది వ్రాసినందుకు తనకుతాను ధన్యవాదాలు ఇచ్చుకొన్నాడు.

## ౨

సత్యధన్‌కి తల్లిమాత్రమే ఉంది. తండ్రిలేడు, మఱి యెవ్వడూ కావలసినవాడు లేడు. ఒక అప్పగారు మాత్రం పెద్దదిఉంది. పిల్లాజెల్లాతో ఈవిధంగా అతని కెట్టిబాధ్యతా లేనిపరిస్థితిలో ఉన్నాడు. అతనికి ఇంకా పెండ్లి కాలేదు. సంబంధాలు చాలవచ్చాయి కాని షేక్‌స్పియర్ నాయికకాదగిన వధువు ఒక్కతే లేక పోవటంచేత అతడు వారినెవరిని చేసుకోలేదు. బి. ఏ. అయింది. యల్. యల్. బి. కూడా అయిపోయింది. తరువాత అతనిలో ఆదర్శయుగం ప్రారంభమైంది.

ఇంతమట్టుకు ఆలోచన ఏమిటంటే దర్జాగా ఉండాలి, ప్రతిష్టా శిఖరంమీద కెక్కాలి, అసాధారణ జీవనము గడపాలి అని. కాని ఇప్పుడు జీర్ణమైన శీర్ణమైన దుకూలాలతో, అపరిచితంగా, అజ్ఞాతంగా, మామూలుగాఉండి జీవితంలో ఎందుకు తుష్టిని సంపాదించలేం? ఇదీ ఆలోచన. ఇప్పుడతడు తన జీవితపథంలోని స్తంభాలమీద 'ఉన్నతి' అనే మాటలను కొట్టేశాడు. దానిస్థానే 'ఉత్సర్గము' అని వ్రాసుకొన్నాడు. ఇప్పుడు అతని హృదయంలో షేక్‌స్పియర్ నాయికకు స్థానంలేదు. అతనికిప్పుడు కావాలిసింది సాదాయైన, కల్లకపటం తెలవని అమాయికపుపిల్ల. ఆపిల్లను తేను తయారుచెయ్యాలి. కులదర్పంలేని పిల్ల కావాలి. మఱి కావాలి, పతితో తనదర్పం, గౌరవం కేంద్రీకరించి పూజింపగలిగే పిల్ల.

పెండ్లినిగురించి ఈఆలోచనలు తనలో పరుగెత్తు తున్నాయి. తనకు తెలియకుండానే విచిత్రంగా ఒకపిల్ల అతని జీవితఘట్టం (రేఖ) చేరుకుంటోంది.

ఆపిల్లది తనవూరే. ఇరుగు పొరుగునే ఇల్లు. పల్లెటూరులో ఇరుగుపొరుగు అంటే భేదమేఉండదు, బస్తీలోలాగ. అంచేత తనఇంట్లో పిల్లలాగానే ఉంది.

కాస్త బుద్ధితెలిసిన దగ్గిరనుంచి వస్తూపోతూ ఉంది. తన కళ్ళఎదుటనే పసిపాపనుంచి పద్నాలుగేళ్ళ పిల్లయింది. తను చిచ్చికొట్టి పడుకోపెట్టిన రోజులూ ఉన్నాయి, తనతో ఆడుకున్నరోజులూ ఉన్నాయి.

ఈమధ్య ఒక దుర్ఘటన జరిగింది. దాంతో ఆ అమ్మాయి రసభరిత జీవితం సాంతమే కావాలి సింది. అదృష్టము అనండి దురదృష్టం అనండి-నాలుగో ఏట పెండ్లి అవటం, అయిదో యేడు వచ్చేరాక మునుపే విధవరికం రావటం!

అప్పుడు తను ఎనిమిదో క్లాసు చదువుతు న్నాడు. తనకు తెలియకుండా ఎట్లా వుంటుంది. తెలి సింది. కాని 'విధవా' విశేషణము తమ ఇరువురి మధ్య ఆటంకం కాలేకపోయింది. వాళ్ళ యిద్దరికి ఏం పట్టింది? ఒకనాటి ముచ్చట - లడ్డూలు పూరీలు ఆహాడావుడిఅంత - దాంతో వాళ్ళ స్నేహానికేమీ అంతరాయం కలుగలేదు. అందుచేత తమ ఇరువురి ప్రపంచం ఒకే మాదిరిగా ఉండి పోయింది. పైపెచ్చు ఆ 'విధవా' శబ్దము మఱింత సన్నిహితులను చేసింది!

సర్కారు బడిలో పదోక్లాసు చదువుతున్న ఛాత్ర మహాశయునకు తోచినప్పుడల్లా 'విధవా' అంటూ వుండేవాడు. ఆ మాట వింటంతోటే ఏడేండ్ల పిల్లకూ ముఖం విప్పారిపోయేది.

ఈ వినోదానికి 'విధవా' శబ్దంతో తమకు పనిలేక పోయింది. కాస్త ఆపిల్లను ఏడిపించటం అతని సర్దా. అప్పుడప్పుడు కాస్త కంగారు పడడమే స్త్రీ తత్వ లక్షణంకూడా.

ఈ విధంగా 'విధవా' శబ్దము కోపం తెచ్చుకోటానికి, తెప్పించటానికి ఉపయోగపడింది. దాంతో మఱింత ఆప్తులయ్యారు.

కాని ఇప్పుడు కాలేజినుండి ఆ పదోక్లాసు అబ్బాయి తెలివిమీరి వచ్చాడు. ప్లీడరు అయి వచ్చాడు. పైపెచ్చు వేదాంతికూడా అయ్యాడు.

ఇప్పుడు 'విధవా' శబ్దాన్ని పొరపాటుననైనా బుర్రలోకి రానివ్వడు.

కాని జీవితంలో మొదటి రోజునుంచి యెల్లా వాయువు ఆవశ్యకమూ, సులభ ప్రాప్యమో, అల్లానే ఈవిషయంకూడాను. విశేషంగా అనుకోవలసినపని లేదు.

ప్రతిసంవత్సరం వేసవి సెలవుల్లో అతనికి ఒకటే పని. ఆపిల్లకు చదువుచెప్పటం. కోర్సుఆఖరైన తరువాత ఆసెలవులకు ఈ సెలవులకు పిల్లకు భేదమేమీ కనపడలేదు. తాను చదువుకోటానికి వస్తుంది. ఈ సెలవులు నాలుగురోజులు ఎల్లాగడుస్తాయో యేమో!

చదవటం ప్రారంభించి ఇప్పుడా ? చదువు కించిత్తుకూడా సాగిందిలేదు. అసలుసంగతేమిటంటే, ఏడాదిఅంతా ఖాళీగా ఉండటం, సెలవుల్లో మాత్రం గునగునలాడటం. గ్రామంలో మరిఎవ్వరిదగ్గిర చదువు తుంది ? అదీగాక ఒక్కతె, తనకుతాను ఎన్నిరోజులు చదువుతుంది? కాని చదివించటానికి మాష్టరుగారికీ విసుగులేదు, చదవటానికి పిల్లకీ విసుగులేదు.

ఇటువంటి నిరంతరోత్సాహం ప్రశంసనీయంకదూ!

## 3

పిల్లశ్రద్ధగా చదువుతోంది. మాష్టరుగారు అట్టే శ్రద్ధగాలేరు. ఏమి ఆలోచిస్తున్నారో ! పిల్ల కాపీ పట్టి వ్రాస్తోంది. ఇంతట్లోకి తను ఇంగ్లిషురీడరు కాజేశాడు. ఇవ్వాళ చదవాల్సినపేజీమీద శ్రద్ధగా ముత్యాలు లాంటి అక్షరాలలో వ్రాసినాడు.

మా 'కట్టో' చదువుతోంది. జనులంటారు, అది విధవని! కాని మేమంటాము అది'కట్టో'. ప్రపంచ మంతటికంటె మంచిది.

'ఒకరోజు మేము వెళ్ళిపోతాము. అది ఉండిపో తుంది. తిరిగి అదీ వెళ్లిపోతుంది – ఇది చాలా దుఃఖదా యకం !'

కట్టో వ్రాయటం అయిపోయింది. ఇక చదవాలి. పుస్తకం గురువుగారు మాయంచేశారు. పైగా ఆయన చేసిందేమిటి? పుస్తకం మన ఇష్టంవచ్చినట్లు

వ్రాసేవస్తువా ? కట్టో తన నాలుగువైపులా పుస్త
కం వెదికింది కాని దొరకలేదు.

గురువుగారు: "ఏమిటి ?"

"రీడరు."

"నేను తీసుకున్నానా ? "

"మరి ఎక్కడపోయింది ? "

"చూడు!"

కట్టో తిరిగిచూడటం ప్రారంభించింది. విసిగి
వేసారి నిల్చుంది.

"చూసివచ్చాను."

"దేవతలేం తీసుకుపోరు, తిరిగిచూడు!"

గురువుగారు మెల్లిగా గదిమూలలో పడేశారు.
బాగా వెదకినతరువాత కట్టో అన్నది.

"సూదా ఏమిటి, కనబడకుండా ఉండటానికి? "

"మంచిది, నేనుకూడా వస్తాను. ఇప్పుడుచూడు!"

చాలసేపు వెదకినతరువాత గదిమూలలో చిరా
కుగా పడిఉన్న పుస్తకం దొరికింది.

"ఎక్కడో పారేస్తావు. పోయింది, పోయింది
అంటావు."

"నేను జాగ్రత్తగానే పెట్టాను!"

"చాలా జాగ్రత్తగా పెట్టావు...ఉహు...సరే
పాఠం ప్రారంభించు!"

పాఠం ప్రారంభమైంది. ఆపేజీయే తెరచింది.

"ఇదేమిటి ఇల్లా చేశావు ? ఖరాబుచేసేశావు."

"ఏదీ, చూడనియ్యి!" మాష్టరుగారు పుస్తకం తీసి శ్రద్ధగా చూశారు.

"ఎవడో, వట్టి పిచ్చిముండావాడు! ... లేక నువ్వే ఈపని చెయ్యలేదు కదా ?"

"నేను నిజం చెప్తున్నాను. నేను చెయ్యలేదు."

"అబ్బో నిజం చాలా చెప్తావు. మరి ఎవరు చేస్తా?"

"నువ్వు చేసివుంటావు."

"నేనే! రామ రామ!"

కాని అతను ప్రకటించిన ఈ విస్మయమంతా పిల్ల అనుమానాన్ని మఱికొంచెం బలపరచింది.

"నువ్వు కాకపోతే మరిఎవరు ?"

"నేనా ? చూడు! నీ ఎదుటనేగా కూర్చుని ఉన్నాను ?"

"అవునవును. గప్‌చిప్‌గా పుస్తకం తీసుకుని ఉంటావు."

"అరేరే! నేనేమైనా మూర్ఖుణ్ణా ?"

"ఏమో నాకు తెలియదు. నేను చదవను. నాకు వేరే పుస్తకం తెచ్చియ్యి!"

"ఎవరు తెస్తారు?"

"నువ్వే!"

"ఎందుకు?"

"ఏమో!"

"ఏమో నాకూ తెలవదు."

"అట్లాఅయితే నేను..."

"నేనసలు..."

"తీసుకురావా ?"

"ఊహూ !"

"నేను చదవను."

"చదవబోకు !"

వెంటనే కట్టో తన సంచీ అక్కడనే వదలిపెట్టి పోవటం ప్రారంభించింది.

"పిచ్చిదానా ! కట్టో... విను విను !"

కట్టో వెళ్ళుతూనే యీ మాటలు విన్నది. అదృశ్యం అయ్యేదాకా వెళ్ళుతూనేవుంది.

రెండోగదిలోకి వచ్చినిలబడింది.

"ఎక్కడో పిచ్చిదానివిలాగా ఉన్నావు, విను."

కట్టో కేవలం మౌనం.

మాష్టరుగారికి కట్టో వెళ్ళదనే పూర్తినమ్మకం. తిరిగి రెండుమూడుసార్లు కేకలెట్టాడు. కట్టో మెదలకుండా నిలబడిపోయింది. మారుచెప్పలేదు. మాష్టరుగారు హడావుడిగా వచ్చారు. పెద్ద దర్వాజాదాటి వీధిలోచూచాడు. కట్టో బజారులోలేదు. అక్కడే నిలబడిపోయాడు. ఆలోచించాడు. రెండుక్షణాలుఆగి లోపలికి చరచరా వచ్చాడు.

కట్టో మాష్టరుగారు బైటకు వెళ్ళగానే తను చదువుకునేగదిలోకి వెళ్ళిపోయింది. చదువుకునేబుద్ధిమంతురాలులాగా కష్టమైన మాటలు పుస్తకంలోనుంచి యేరివ్రాయటం మొదలుపెట్టింది.

మాష్టరుగారు వచ్చారు. వస్తూనే "ఎవరు ? కట్టో !"

కట్టో మొగమటు, యిటు కదలించనేలేదు.

"నువ్వు బలేపెంకిపిల్లవే !"

కట్టో ఇప్పుడుకూడా చలించలేదు. తన పనేమో

"ఎక్కడ మాయమైపోయావు ?"

కట్టో పైకి చూచింది. కళ్లల్లో భావస్ఫూర్తి నిండి ఉంది. "నన్నెవరు ఓడియ్యగలరు ?"

అయితే కొత్తపుస్తకం తెచ్చి యియ్యవూ ?"

"ఎందుకివ్వనూ ?"

కట్టో సర్వస్వం మరచిపోయి మాష్టరుగారి మొఖంమీద మొఖంపెట్టి కిలకిలా నవ్వటం మొదలు పెట్టింది.

"ఈ పుస్తకం నాకు ఇచ్చివేయి!"

"అయితే నువ్వేగా ఇందులో వ్రాసింది ?"

మాష్టరుగారు పట్టుపడ్డారు—"అవును!"

"అయితే ఇది నీకివ్వను."

"ఏం చేస్తావు ?"

"ఏమైనా చెయ్యనీ !"

"ఏమైనా ఏంచేస్తావు ?"

"చింపేస్తాను !"

"వద్దు, వద్దు!"

పుస్తకాన్ని రెండు చేతుల్లో పట్టుకొని పిల్ల అన్నది "ఇదిగో...చింపేస్తున్నా... ను."

"వద్దొద్దు!"

"చింపుతున్నా!"

"వద్దంటూంటే...మళ్ళీ చూడు!"

మాష్టరుగారు తన చేతుల్లోంచి పుస్తకం తీసుకో లేకుండా వున్నాడు..., "ఇదిగో చింపుతున్నా"

మాష్టరుగారు, నిజంగానే చింపుతోందను కున్నాడు. అమాంతం మీదికి పోయాడు. పిల్ల నిస్తబ్ధ అయింది. తెప్పపాటులో దూరంగా వెళ్లి నిలుచుంది.

"బలే, తీసుకున్నారు పుస్తకం! ఇదిగో చించే స్తున్నా!"

"నీకు నమస్కారం చేస్తా. చింపకు!"

"ఏదీ, చెయ్యి!"

మాష్టరుగారు రెండు చేతులు జోడించాడు.

బాలిక తన రెండు చేతుల్తో ఆ చేతుల జంటను పట్టుకున్నది. "పుస్తకం ఇదిగో పుస్తకం!"

"ఇప్పుడు పాఠం చెప్పు!"

మాష్టరుగారు మొదలకుండా పాఠం చెప్పడం ప్రారంభించాడు.

౪

చదువుతీరు ఇట్లావుంటే మనస్సులో కలవరింతలు ప్రారంభం కావుమరి! మాష్టరుగారి జీవితం కించిత్తు రసవంతం కా ప్రారంభించింది. తను అనుకుంటూ వుండేవాడు, ఒక దృఢనిశ్చయానికి వచ్చేశాను అని.

భావాలను, అభిప్రాయాలను తరచి తరచి దృక్షీక రించి అనుకుంటూవుండేవాడు. ఇక యీ ఉన్నత భూమికనుండి దిగనూ - అని. జీవితానికి చుట్టూగిరిగీ యటం ! తుయ్యటం ! ఇది ఇంతేననుకోటం !

కాని ఏమైపోయింది అదృష్టము ! క్షణంలో కల వరపాటేమిటి ? ఇప్పటిదాకా ఏంలేదే ! ఆ తిన్నె మీదకూచుని జీవితమర్మాలను, ప్రపంచ రహస్యా లను అవగాహన చేసుకోటం, వాటికి సమాధానా లను వెదకటం అమిత తేలికగావుంది అతనికి. కాని ఇప్పటికిప్పుడే యావత్ప్రపంచము, తనూ, ఆ తిన్నె ఏదోఊయెలలో ఊగిపోతున్నాయి. ఒక మహాతరం గములేచి వాటినన్నిటినీ ఆవిప్లావితం, హతాహతం చేసేస్తోంది. అన్నీనశించి శ్రావణమాసంలో, సంధ్యా సమయాలలోమెరసే ఆకాశంమీది ఇంద్రధనుస్సు మిగి లింది. రంగులన్నీ లీనమైపోయాయి. కాని ఆరంగులో కట్టోభాసిస్తోంది. ఇదేమిటి మాయ !

చిన్నపెళ్ళ వచ్చి నిస్తబ్ధతా నీరవతామయమైన విశాల సాగరాన్ని కల్లోలితంచేసింది ! పసిగాడ్పువిసరి పాతాళ పర్యంతమైన జలాన్ని వడవడ కంపింపచే స్తోంది ! ఒకతరి తీపిభావం, తనలోని అజ్ఞాత ఆవేగాన్ని మేల్కొల్పి, ప్రసుప్తమైన జీవితాన్ని ఉఝ్రూతలూగి స్తోంది ! గిన్నెబైట కదిలింపగానే, లోపలనీళ్ళన్నీ అస్వస్థమౌతున్నాయి !

అగాధ జీవనంలోంచి పైకి లుదేరిన తరంగం

మనుష్యనిర్మితమైన, సికతాప్రాకారాల్ని పూడ్చి పెట్టదూ! ఊడ్చివెయ్యదూ ?

౫

కట్టో పరిచయం కలుగజేసుకుందాం.

నాలుగోయేట విధవ. తల్లిదండ్రులకు 'లేవడి యెంతేని జీవనంబు, తండ్రిలేడు. మిగిలింది తల్లిఒక్కతె. తను తల్లిమీద బరువు. కొంచెం జిగ్రుమంటే తల్లి స్వర్గాని కెదురుచూస్తో వుంటుంది. కావాలిసినవాళ్లు ఉన్నారు. కాని వారు అన్నివేళలా కాదు! పేరు ? మాష్టరుగారి నామకరణం కట్టోఅని. అమ్మాయికి కోపం వస్తే వస్తుంది. మనకుకూడా ఆపేరే ఇష్టం. కేవలం నిరర్థకమైన పేరుగాదిది. మాష్టరుగారు పెద్దగా ఆలోచించి పెట్టిందికాదు. కాని చాల ఉపయుక్తమైన పేరు. ఉడుతను 'కట్టో' అంటారు. అమ్మాయిగడ్డం ఉడుత మొహంలా ఉంటుంది, అల్లాగే కొసదేరి. మొఖంలో భావాలన్నీ ఉడుతలోలాగానే జిలిబిలిగా వుంటాయి. ఆదరాబాదరా, ఇటుగంతు, అటుగంతు అన్నీ ఉడుత చేష్టలే!

ఉడుత వెనుక రెండుకాళ్ల మీదకూర్చుని అటుచూసి ఇటుచూసి నోటిలో ఏదైన గుండ్రనవస్తువు పెట్టుకుంటుంటే ఎంతఅందంగా వుంటుం దంటారు ? అచ్చంగా అల్లాగేవుంటుంది కట్టో! ఒక చిటికెవేయగానే ఉడుత చెట్టుకొనకొమ్మలలో ఎక్కి కూర్చున్నట్టే

మాటలో 'కట్టో' మాయమైపోతూ వుంటుంది.

కాని ప్రపంచంయొక్క విషమదృష్టి-చూడు. ఒక దానికి యీ చిలిపితనమంతా అందమూ, సొగసూ. మఱోదానికి అవ్వే శాపోదకాలు. 'కట్టో' ఉబలాటమూ, జిలిబిలితనమూ చూచి ప్రపంచం సహించుకోలేదు!

జనులంటారు– అదివిధవ. దురదృష్టవంతురాలని. పిల్లకూ తెలిసింది తను వెధవననీ, దురదృష్టవంతురాలననీ, కాని– కాని, తనయీ ఉత్సాహమూ, యీ ఉబలాటమూ, ఈ పొంగూ, ఎందుకు ప్రకటించకూడదో – అర్థం కావటంలేదు!

పిల్ల పెద్ద అందమైందికాదు. పెదవులు విప్పారి ఉంటాయి. మొఖంలో ఇంకా అనేక లోపాలు చెప్పవచ్చు. కాని వీటిని గురించిన విచారం యీషణ్మాత్రం లేదు. తను అనుకుంటుంది. అందం తక్కువదాన్ని కాదు అని. రంగుకూడా ఫరవాలేదు.

కాని కళ్లు? అందులో మఱి ఏమున్నదో! ఒక క్షణమైనా అవ్వి ఒకవేపు చూడలేవు. ఇటూ, అటూ, అటూ, యిటూ పరుగెత్తుతూ ఉండవలసిందే! నిలబడి చూచాయా? అంతరాంతములలోకి చొప్పడి పోవాలసిందే. ఎటువంటి ఔత్సుక్యము! ఎటువంటి పొంగు! ఆహ్వానిస్తూ ఆదరిస్తూ చల్లగా పచ్చిక బయలులా ప్రశాంతంగా వుంటాయి. ఒకదీప్తి ఉంది, వాటిల్లో తెప్పలు వాల్చి చూస్తే ఆర్ద్రి ఆర్ద్రింగా ఉంటాయి ఆ చూపులు!

ఆ కళ్లల్లో వినోదం ఉంది. దాంతోపాటు హింస - హింసలో వినోదం - ఈ రెండు భావాలు సమైక్యం పొందాయి ఆ చూపుల్లో. అతీత సుందరమ్మైన ఆ కళ్ళను, సుందరంగా లేవని నీవనవచ్చు. స్త్రీ తత్వం కాపురం చేసుకున్నాయి ఆ కళ్ళు.

౬

మాష్టరుగారు ఆలోచిస్తున్నారు. నన్ను అల్లించి, బెల్లించి రేకెత్తిన ఈ తియ్యని భావానికి దోహదం ఇస్తే ఫలితం అనిష్టకరం కాక తప్పదు.

అప్పుడే 'కట్టో' చదువు సంచీ తీసుకొని వచ్చింది! "కట్టో! ఈ వేళకు చదువులేదు. నేటి నుంచీ."

కట్టోది ఒక చెయ్యి మాష్టరుగారి పుస్తకం మీద వ్రాలింది. చెయ్యే థర్మామీటరు!

"ఎందుకని? వంట్లో యెట్లావుంది? ఎందుకు మనస్సు జారిపోతుంది?" అన్నాడు

ఆరోగ్యం సరిగానే వుంది. కాని నేటి నుంచీ కట్టో మాష్టరుగారికి డాక్టరీకూడా చేస్తుంది. చెయ్యిపెట్టి చూచి "నిజానికి వళ్లు మామూలుగానే వుంది. శారీరకంగా ఏమీ బాధకనుపించ లేదు."

"ఈ వేళ ఫిషర్ మన్ పాఠము. సీషోర్ అంటే మరి- బిల్లోస్-"

"సీషోర్ - సముద్రపువొడ్డు- బిల్లోస్-, అలలు -

ఆ కళ్లల్లో వినోదం ఉంది. దాంతోపాటు హింస - హింసలో వినోదం - ఈ రెండు భావాలు సమైక్యం పొందాయి ఆ చూపులో. అతీత సుంద రములైన ఆ కళ్ళను, సుందరంగా లేవని నీవనవచ్చు. స్త్రీ తత్వం కాపురం చేసుకున్నాయి ఆ కళ్ళు.

౬

మాష్టరుగారు ఆలోచిస్తున్నారు. నన్ను అల్లించి, బెల్లించి రేకిత్తిన ఈ తియ్యని భావానికి దోహదం ఇస్తే ఫలితం అనిష్టకరం కాక తప్పదు.

అప్పుడే 'కట్టో' చదువు సంచీ తీసుకొని వచ్చింది! "కట్టో! ఈ వేళకు చదువులేదు. నేటి నుంచీ."

కట్టోది ఒక చెయ్యి మాష్టరుగారి పుస్తకం మీద వ్రాలింది. చెయ్యే థర్మామీటరు!

"ఎందుకని? వంట్లో యెట్లావుంది? ఎందుకు మనస్సు జారిపోతుంది?" అన్నాడు

ఆరోగ్యం సరిగానే వుంది. కాని నేటి నుంచీ కట్టో మాష్టరుగారికి డాక్టరీకూడా చేస్తుంది. చెయ్యిపెట్టి చూచి "నిజానికి వళ్లు మామూలుగానే వుంది. శారీరకంగా ఏమీ బాధకనుపించలేదు."

"ఈ వేళ ఫిషర్‌మన్ పాఠము. సీషోర్ అంటే మరి- బిల్లోస్-"

"సీషోర్ - సముద్రపువొడ్డు- బిల్లోస్-. అలలు -

యింపుకు నేడే ఆఖరురోజని. ఉత్సాహము కుంగిపో యింది. నీరసంగాఅంది.

"నేనెవ్వతెను ? నాబలవంతం ఏమిటి ? " అప్రి యమైన ఈ ప్రసంగాన్ని సాగనివ్వటం మాష్టరుగారి అభిమతంకాదు.

"సరే ! చదువు, చదువు ! "

చదివింది. కాని చాలా నీరసంగా, శుష్కంగా వుంది. తోడిమనుండిపడిన పండులాగా ఆమె మనస్సు ఘూళిచే కప్పబడిపోయింది. యంత్రంలాగా కళ్లు అక్ష రాలలోగ్రుచ్చి చదువుతోంది- కాని ఏమి చదువు తోందో తనకే తెలవదు.

మాష్టరుగారి మనస్సుకూడా గాద్గదికంగావుంది.

"కట్టో! ఇహ వెళ్ళాలిసుమా! "

"వెళ్ళాలా ? ఎక్కడికి ? సెలవులు ఆయిపోయి నాయా? "

సెలవులు కాలేదు. తిరిగి సెలవులు ఇకరావు. కాని ఇదంతా కట్టోకు ఎట్లాచెప్పటం ?

"సెలవులూ ఆఖరు అవుతున్నాయి."

"కాని యీసారి యింత తొందరగా... "

"అవును ! "

రాచుకొనివచ్చిన 'అవును' విని కట్టో "సెలవు లైపోతే వెళ్లు...ఎందుకట్లా అవుతావు ? "

సత్యధన్ నిబ్బరించుకొని అన్నాడు.

"ఎక్కడ ? ఏముంది ? "

"అయితే రేపు వెళ్లిపోతావా! "

రేపే వెళ్ళిపోవాలి అని అనుకో లేదు. కాని ఇప్పుడంతకంటే ఏమంటాడు?

'అవును! '

"ఉదయమా? సాయంత్రమా? "

"మూడోజాము! "

"మంచిది. నేనురానంతకు వెళ్లకు. తెలిసిందా?"

"వెళ్ళను."

కట్టో వెళ్ళిపోయింది. కాని మాష్టరుగారు తిరిగి ఆలోచనలో... ప్రేమేమిటి ? కట్టోమీద తనకు వుండి వుండి జాలికలుగుతోంది. శూన్యము, అంధకార బంధురమూ అయిన భవిష్యత్తును గుర్తెరుగక వర్తమానంలోనే నిమగ్నమై వుంది. ఇట్టి భవిష్యత్తులోకి కట్టో కాలిడితే దానిగతి ఏమికావాలి? కాని దానికా చింతే లేదు. భవిష్యత్తు తారుమారవుతుందా? జీవితంలో ఆఖరురోజువరకు తనదగ్గిఱకు చదువుకోటాని కిట్లాగే రాలేదా? తాను ఇల్లాగే బ్రహ్మచారి మాష్టరుగా వుండిపోతే...

కాని రేపు వెళ్లిపోవాలి. ఎందుకు వెళ్లాలి? వద్దు. వెళ్లవద్దు. పసుగెత్తుకునిపోయి ఏమిటె చేయటం ?

అదిగో, పోష్టువాడు వుత్తరంఇచ్చి వెళ్లాడు.

బిహారీదగ్గరనుంచి ఉత్తరంవచ్చింది. వాడు ఫైల్ అయ్యాడు. బిహారీతండ్రి కుటుంబసహితంగా కాశ్మీరు వెళ్లుతున్నాడు. తన్నుగూడా రమ్మని పదేసదే వ్రాశాడు.

ఉల్లంఘించటానికి వీల్లేదు. రాకపోతే ఒట్టు – గరిమ కూడా మరీమరీ చెప్పింది. ఫలానారోజు వెళ్ళుతున్నాం. అంతకుముందే మమ్మల్ని కలుసుకోవాలిసింది అని కూడా వుంది.

ఈ ఉత్తరం ఈ క్షణంలోనే ఎందుకు రావాలి? అదృష్ట సూచకంగానా?–ఏమో– ఇదిగో కట్టో! నేను నిజంగానే వెళ్లి పోతున్నాను.

బిహారీకి ఉత్తరం వ్రాసేశాడు. మరుసటిరోజు ఉదయం అయింది ... మధ్యాహ్నంకూడా దాటి పోయింది. ప్రయాణ సమయం కూడ దగ్గిఅపడింది... కాని కట్టో రాలేదు. లోలోపల ఉత్కంఠాతిశయంతో ప్రతీక్షిస్తున్నాడు – రాకపోతే దిగులు పడిపోతున్నాడు. కాని ఆలోచించాడు 'నాకంటె గట్టి మనసు గలది. నేనే ఎందుకిట్లా జారిపోవాలి?' ఆకస్మికంగా తట్టింది– 'వస్తే వచ్చింది లేకపోతే లేదు ఒక క్షణం ముందే పోదాం.'

పాపం కట్టో చెయ్యవలసిన పని చాలా వుంది. మొదట బాగా ఏడ్చింది – అంతకంటె ఆమె తన దుఃఖ భారాన్ని ఎట్లా వెలువరిస్తుంది? తరువాత ఒక దిండు తయారుచేసింది. అది మాష్టరుగారి కివ్వాలి. చాలా జాగ్రత్తగా తయారుచేస్తోంది – ఏదో ఇష్టంవచ్చినట్లు కాదు – రెండుజాములు గడిచేటప్పటికి దిండు తయారయింది. 'నేను లేకుండా ఆయన ఎట్లాగు వెళ్ళ లేడు' అనుకుని నిశ్చింతగా మోనోగ్రామ్ మీాద తొందరతోం

దరగా సూది త్రిప్పుతోంది. ఆ మోనో గ్రామ్‌కి వెనుక చరిత్ర వుంది. ఆచరిత్ర చెప్పటం మొదలుపెడితే మరీ ఆలస్యం ఐపోతోంది. మాష్టరు వెళ్ళిపోతారుకూడా!

పని పూర్తియింది. దిండు కాగితంలో చుట్టి తీసుకు వెళ్ళింది ...... మాష్టరుగారు ఏరీ?

తన అధికారం పూర్తిగా నశించిందా? ఈ కొంచెం మాటకూడ లెక్క చెయ్యలేదేమి? ఇప్పుడే వస్తుంటెని. ఇంతలో ఇంత తొందరేమిటి? ఆమె యేడ్వ లేదు. నిశ్చేష్టు రాలైంది.

మాష్టరుగారి సారస్వతహృదయం కొంత పని చేసింది. కానున్నది కాకమానదు. సర్వం రసవంతం గానే ఎందుకు కాకూడదు? నవ్వుతూ పేలుతూనే ప్రతి పనీ జరగాలి. టాంగా మీద పరుపు పరిచాడు. కొంచెం దూరంగా వుండి చూద్దాం. కట్టో ఆలోచనలో పడ్డప్పుడు పరమాత్మ యొక్క విభూతిలా ఆకస్మిక దర్శనం ఇద్దాం.

కట్టో కొయ్యబారి నిలబడి పోయివుంది. ఎక్కడి నుంచి ఈ ధ్వని 'కట్టో!' ...... దాంతో పాటు కిల కిలా నవ్వు!

విద్యుత్‌లా క్షణంలో జీవితంలోని ఉద్వేగ తరంగం శరీరం యావత్తూ పరుగెత్తిపోయింది.

ఒళ్ళు జలదరించింది. – పులకరించింది. ఒక్క పరుగు పెట్టింది.

"నీవుచాలా కఠినుడవు!"

"ఈకాగితంలో ఏమిటి?"

"చూపించను...... ఇవ్వను."

"ఎల్లాఇవ్వవో, చూపించవో చూస్తాను!"

"నాతో పోట్లాడతావా? అర్జునుడవే! ఇదుగో!" ఇచ్చి తను ఇంటిలోకి రివ్వున దూసుకొని పోయింది.

విప్పిచూచాడు చాల పనివాడితనం చూపించింది! ... ఈ మోనోగ్రామ్ నేను తయారు చేసిందే. ఇదే ఇప్పుడు పట్టు దారాలతో కుట్టి నాకే ఇస్తోంది. ఈ భయంకరమైన వస్తువును నాదగ్గిర ఎట్లావుంచుకొనను? దీనితోపాటు మరి ఏవస్తువు ఆటంకముగా గ్రుచ్చబడి వుందో? ... దానికి అధికారిని నేనెట్లా అవుతాను?

లోవల గదిలో కట్టాని కలుసుకున్నాడు.

"ఇదిగో నీపనిముట్టు నీవు తీసుకో! నేనేమి పాడుచెయ్యలేదు."

"నేను తీసికోను"

"నేనేం చేస్తాను?"

"ఏమిటి చేస్తావా? దగ్గిఱ ఉంచుకొంటావు. ఉంచుకోలేకపోతే విసిరిపారెయ్యి, అంతేగాని తిరిగి నాకు యివ్వడానికి కాదు."

కామెడీ గందరగోళంలో పడింది. ఈ వీడ్కోలు ఘట్టము దుఃఖాంతమైతే సర్వకాలాలకు మనస్సును బాధిస్తుంది.

"సరే! అల్లాగే వుంచుతాను!"

" ఉంచకపోతే? "

" ఉంచుతానన్నానుగా ... ఇహావెళ్తా మఱి-"

" వెళ్లు ! "

కాని 'వెళ్లు' లో యెంతో ఆవేదన ఇమిడివుంది. పైకి అన్నాడు:

" పాఠంగట్టి చేసుకుంటూవుండు. వచ్చిన వెంటనే పరీక్ష ఇవ్వాలి. తెలిసిందా ?"

" మంచిది! " —

" మంచిది కట్టో ... వెళ్లుతున్నను " అంటూ కట్టోది ఒక చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు.

" ఎంతమంచికట్టో ! పూర్తిగా పాఠముచదువుతావుకదూ ? నేను జ్ఞాపకం ఉంటానా ? "

" ఊఁ "

ఎక్కువ ఆలస్యముచేయుట మంచిదికాదు. మనస్సు లాగబడిపోతోంది. జేబులోంచి ఒక బంగారు అంచులతో ఉన్న పుస్తకం తీశాడు.

" ఇదిగో , నీ దిండుకు బహు మానం!"

అతడు మెదలకుండా ఇచ్చాడు. కట్టో మాట్లాడకుండా స్వీకరించింది.

అతడు వెళ్లిపోయాడు. ఆమె అట్లా నిలుచుని వుంది...ఇంటికివచ్చింది. కిటికీలువేసి పుస్తకం తెరచింది. లోపల అదేమోనో గ్రామ్. ఇది ఎంతఅందంగా వుంది, నాది ఎంతమోటుగా వుంది?

"ఓ మాష్టర్ ! నీవు ఎక్కడికి వెళ్లావు ?"

# ౭

పంతులుగారు కాశ్మీరు దారిలో వున్నారు. బిహారీ కూడా వున్నాడు. బీహారీ తల్లి, తండ్రి, చిన్న తమ్ముడు, చెల్లెలు గరిమా ఉన్నారు. గరిమ అనే పేరు మాష్టరుగారు పెట్టిందే. తన గ్రామంలోని పల్లె టూరి పిల్లను చూచీ చూడటంతోటే 'కట్టో' అనే పేరు ఎట్లాతట్టిందో 'గరిమా' అనే పేరు అట్లాగే తట్టింది. ఇంట్లోవాళ్ళందరికి అదేపేరు అయిపోయింది. కాలేజీలో రెండో సంవత్సరంనుంచి బిహారీ తన సహ పాఠి. మొదటిసారిగా ఇంటికి వెళ్ళినప్పుడు బాబూజీ తన్ను తన ఆత్మీయుడుగా భావించుకొన్నాడు. బిహారీ తల్లి తన్ను 'అబ్బాయి' అనే పిలిచింది. గరిమా అప్పుడు వికాసోన్ముఖమై వుంది.

బాబూజీ వకీలు. బహు లౌక్యుడు. సత్యధన్‌ను చూచిన మీదట గరిమానుగురించిన విచారం ఆయన పెట్టుకోలేదు. ఇంట్లో ఒకసారి అన్నాడుకూడా.

"పిల్లను చదివించాల్సిన పని ఒకటే మిగిలిపో యింది. తరువాత విచారం మనకు అక్ఖర్లేదు."

సత్యధన్ నేత్రాలు షేక్స్పియర్ నేత్రాలు కన్న తక్కువ తిన్నవి కావు. జూలియట్ కంటె తక్కు వదానిని అతను ఊహించనే లేదు. శకుంతల ఇప్పుడు దుర్లభ మనే సంగతి ఆతడొప్పు కోడు. ఇప్పటికీ ఉన్నారు. కావలసింది తగినంత అదృష్టం. అతడు తన అదృష్టాన్ని ఎప్పుడూ శంకించ లేదు.

గరిమ చాలా మంచి పిల్ల. చదవటంలో చురుకు, మాట్లాడటంలో నేర్పు, చూడటానికి సౌందర్యము కల అమ్మాయి. ఆమెలో యవ్వనం వికసి స్తే? ...ఇకఅడిగే పనియేమి...కాని...కాని...ఊహు...ఁ.

బి. ఎ అయింతరువాత బాబూజీ డొంక తిరుగుడుగా ప్రశ్నించాడు: " సత్యం! ఇప్పుడేంచేస్తావు? "

" ప్లీడరీ చదవాలి కదా ! "

" మంచిది ! ... మీ అమ్మ పాపం, పెద్దదైనట్లుంది. "

" చిత్తం "

" మరి ఆవిణ్ణిగూర్చి కాస్త ఆలోచించాలి. " సత్య కొంచం తటపటాయించాడు.

బాబూజీఅన్నాడు:" గిరి చదవటం చూశావా ?"

" చాలా చురుకుగా చదువుతోందని విన్నాను. "

" మరే! సంగీతంలో ప్రైజుకూడా వచ్చింది. ఇప్పుడు తొమ్మిదోతరగతిలో ఉంది. "

సత్య తప్పించుకొని వెళ్లిపోవాలనుకున్నాడు.

" వీలు వెంబడిని అమ్మాయికేమైనా చెప్తూవుండు. బిహారీ ఒక్తిపెంకె మనిషి. వాడివల్లేమీకాదు. "

" మంచిది, అల్లాగే!"

సత్య అను కున్నాడు. ఆలస్యమైనకొద్దీ తన నెత్తిమీదకే వస్తుందని. అందుకోసం అతను సాఫీగా చెప్పి వేశాడు.

"అమ్మ పెండ్లిచేసుకోమని బలవంతం చేస్తోంది. ప్లీడరీ కాందే పెళ్లిచేసుకోటం తన్ను గట్ట త్రాళ్లు తానే తెచ్చుకోటం అని చెప్పేశాను. ఇది ఆఖరు సంవత్సరం. ఈసంవత్సరం పూర్తి పరిశ్రమచెయ్యాలి."

"ఆమాట నిజమే" కాని అమ్మ చెప్పిందికూడ సబబే, ఆమెకు శుశ్రూషకెవ్వరైనా కావాలి కదా?"

"కాని ప్లీడరీ కాందే నేనేమి చెయ్యలేను"

"అది నీయిష్టం."

కాళ్లకు తగిలించబోతున్న బంధాన్ని ఈవిధంగా తెంచుకొని అతడుకొంచెంసేపటిలో బైటపడ్డాడు.

బాబుజీ సంగతంతా గ్రహించాడు. పాపం! ఇతను ఇంకా స్వప్నజగత్తులోనే ఉన్నాడు. షేక్స్పియర్ చల్లిన మచ్చుఇంకాదిగలేదు. చదువువేడి కొంత చల్లబడితేనేగాని దారికి రాడు. వాస్తవిక జగత్తులోకి రావాలంటే ఇంకాకొంతకాలం పట్టుతుంది. సరే ఇప్పుడేం తొందరని ? . . .

అప్పటి ఆమాటను బాబూజీ తిరిగి ఇప్పుడెత్తాలనుకున్నాడు, కాశ్మీర యాత్రకు అతన్నికూడా ఆహ్వానించాడు. చూడగానే ముఖలక్షణాలు విముఖంగా కనపడలేదు. అతనికేం తెలుసు . . . ఈమధ్యలో జరిగిన గొడవంతా ?

గగిమ ఇప్పుడు ఎట్రెంన్సు పరీక్ష ప్యాసయింది. కిశోర వయస్సు వచ్చింది. యౌవన వసంతోద్యాన ద్వారంమీద నిలబడి తొంగి చూస్తోంది, ఆమె

వయస్సు. ఇప్పుడిప్పుడే వసంతవాయువులు ఆమె శరీరం మీాద ప్రసరించి నిషా కలుగ చేస్తున్నాయి.

ఇక కొద్ది కాలంలో ఆమె యౌవనోద్యానం ప్రవేశిస్తుంది. సాగిపోతుంది. ప్రస్తుతం నిలబడేవుంది. పూర్ణాభిలాషలను, ఆకాంక్షలను తీసుకొని ఆమె ఇక సాగిపోతుంది.

రైలు పర్వతపులోయలగుండా పరుగెత్తుతోంది. బిహారీ, సత్యలు మాత్రమే మెలుకువతో ఉన్నారు. తతిమ్మా వాళ్ళంతా నిద్రపోతూ వున్నారు. గరిమ, సర్వస్వం తన కనురెప్పలలో దాచుకుని బెంచిమీాద పడుకొని సుఖనిద్ర పోతూంది. పరిధానం ... అక్కడ క్కడా అస్తవ్యస్తంగా వుంది. పసిగాడ్పులు సోకుతూ వుంటే కమ్మగా నిద్రపోవటం ఎంత హాయి! అట్లా నిద్రపోయే యువతిని పరీక్షచేయటం ఎంత ఆనందం!

సత్య అనుకున్నాడు – ఈమె భవిష్య మెంత నిశ్చింతము? జీవితంలోసుఖమేఎఱుగు, విలాసమే తెలుసు... కట్టో! కేవల 'న' కారమూ ర్తిగా జీవితం గడపాలి! ఎటువంటి వైషమ్యం ఇరువురిలో! మళ్లీఅనుకున్నాడు —— ఇప్పుడు నేనేమిచేస్తాను. ఈవైషమ్యం మరింత పెరుగనిచ్చేదా? ... లేకసాదృశ్యాన్ని పెంపొంద జేయనా? ఈవిధమైన తర్కంలోపడి చివరకు అతను తెల్సుకున్నాడు——తనకు, గరిమకు పొత్తుకలవదు.

తిరిగి కట్టోను గురించి ఆలోచన —— దుఃఖితుల యెడ సుఖంలో వుండేవారికి ఎట్టి కర్తవ్యమూ లేదా?

ప్రపంచంలో అంతసుఖం ఏ కొంతమందో గుత్తకొనడం మంచిదా? పీడితులకోసం మనం కొంచమైనా మన సుఖాన్ని తగ్గించుకోకూడదా? ...కట్టోను ఆ విధంగా వదలివైచి నే నెట్లా భోగ విలాసాలలో కూరుకునిపోతాను?

అతనికి మళ్ళీ సమాధానం దొరికింది. తృప్తి పడ్డాడు. తప్పకుండా అట్లాగే జరగాలి అనుకున్నాడు. కట్టో 'విధవ' అనడం 'విధవ' శబ్దానికి విడంబనం! 'విధవ' అయితేనేం తప్పకుండా పెళ్లిజరిగితీరాల్సిందే!

ఈ సమాధానం అతని మనస్సుకి సుఖాన్ని ఇచ్చింది. దాని పెళ్లి! అయిం తరువాతనే నా పెళ్లి!



కాశ్మీరం వచ్చి చేరారు. అక్కడ అతను బిహారీని పట్టుకొన్నాడు. బిహారీ చాలాసూటి మనిషి. అతనిలో సంశయాత్మ నేది లేదు. చిన్నప్పటినుంచి అతనికి సౌఖ్యము, డబ్బు ఉన్నాయి. ందుచేత అతని మనస్సు ఎప్పుడూ నిండుకుండ లాగానే హుందాగా వుంటుంది. డబ్బంటే తనికి లెక్కలేదు. అతనికి జీవితములో కావలసింది రొమాన్సు. అతనికి adventure కావాలి! అటువంటవసరాన్నే అతను వెదుకుతూ వుంటాడు. తండ్రి, కొడుకు గుణాలకు విముఖుడు మాత్రం కాడు. సూటియైన సున్నని, తిన్ననిమార్గంలో నడవడం, దాంతోనే తృప్తిపడటం – ఆట్టే అంత శ్రేయ

స్ఫూర్తమైన విషయం కాదు. ఇది బాబూజీ తన సఫల జీవితం ద్వారా తెల్సుకున్నాడు. అతడు ప్రతిష్ఠా సంపాదించాడు, డబ్బూ ప్రోగుచేశాడు – కాని ఏం లాభం? జీవితంలో ఎన్నడూ సరదా లభించలేదు అతనికి. అందువల్ల బిహారీకి కావలసినంత డబ్బు, స్వేచ్ఛా ఇస్తూ వుంటాడు.

బిహారీకి ఇంకా పెళ్లి కానిది కూడా ఇందుమూలమున నే. దాన్ని గూర్చినచింత తండ్రికి లేదు. మనిషిలా ప్రపంచంలో పెరిగి తన జీవితసహచరిని తానే వెదుకుకోవాలి. ఇది ఆయన సిద్ధాంతం. బిహారీ ఏదో విధంగా తన మార్గాన్ని తాను తయారు చేసుకుంటాడు. అతని కోసం ఆట్టే విచారించటం తగని పని అని ఆయన విశ్వాసం. ఎవత్తైనో కోడలిగా తీసుకువస్తే దానితో అతనికి ఎట్లాగూ సరిపడదు. చివరికి తన జీవితాన్ని కూడా పాడుచేసుకుంటాడని అతని అనుమానం.

కాని గరిమ విషయంలో ఆయన చాలా జాగ్రత్తగా వున్నాడు. ఆ విషయంలో తానెప్పుడూ అప్రమత్తుడు కాలేదు. వ్యక్తిత్వములు భిన్న భిన్నములు. వాటి పూర్ణత్వముకూడా పృథగ్రీతులను కాని సిద్ధింపదు అని బాబూజీ విశ్వాసము.

ఇటువంటి బిహారీ మీద సత్య తన ఆశను నిర్మించాడు. అప్రతిష్ట పనిగాకుంటే, ఎంత సాహసంతో కూడిన దానికైన బాబూజీ సమ్మతిస్తాడని సత్యకి తెలుసు. ఊట లూరించాడు. బిహారీ ఏవిషయానికైనా

చాల తొందరగా మొగ్గుతాడు. వెంటనే దూకుతాడు. పదడుగు లవతలకెళ్లితే దూకటాని కనుకూలమైన చోటు వుంటుందని కూడా ఆలోచించడు. పని ఎంత కష్టమైతే అతడంత ఉత్సాహంగా నిమగ్నుడౌతాడు.

కట్టో మాట విని అతని మనస్సు పురకలు వేసింది. సత్యా ఒక అనాధ బాలికను ఉద్ధరించటముగా నిరూపించాడు. ఫలిత మేమైనాసరే, బిహారీ తయారయ్యాడు.

బిహారీ తన సమ్మతిని చూపించాడు. కాని అడిగాడు "నువ్వు ఎందుకు ముందంజ వెయ్యలేదు ?"

సత్యా తటపటాయించాడు.

"నేను ... ఎట్లా ... నావిషయంలో అది శుద్ధ పరమార్థ విషయం కాకపోవచ్చు."

బిహారి ఈజవాబుతో తృప్తిపడ్డాడు.

గరిమ విషయంలో సత్యా ఇంకా పూర్తిగా అనుకూలుడు కాలేదని అతనికి తెలుసును. సత్యా మాటనతను విశ్వసించాడు. సత్యాకు తన ధన్యవాదాలుకూడా తెలిపాడు.

౭

సత్యా తలనుంచి బరువు తొలిగింది. కట్టో తన మాట వినక పోదని అతని నమ్మకం, తనసుఖానికి కట్టో కంటగించుకోవాలసిన అవసరంకూడా ఉండదు. తనూ గరిమను పెళ్లాడవచ్చు... కాని అప్పటి వరకు... కాదు. అప్పటి వరకు కాదు.

చివరకు ఒక రోజు బాబూజీ ప్రసంగం తేనే తెచ్చాడు.

"సత్యా ఒకమాట చెప్పాలోయ్ నీతో! ఇహ నువ్వు వివాహానికి సంసిద్ధంకావాలి"

ఏమీ ఉపోద్ఘాతం లేకుండానే చెప్పదలచుకున్న విషయాన్ని ఇంత సూటిగా చెప్పేటప్పటికి సత్యా అంజా యించాడు.

"బాబూ! నేను ప్లీడరీ చెయ్యటంలేదు"

"ఎరుగుదును"

సత్యాకు ఆశ్చర్యం వేసింది. "తమరెరుగుదురా! ...ఎట్లా!"

"హోశియార్ బహాదుర్ మాట నాదాకా వచ్చింది.

"తెలిసేనా విూరడుగుతున్నారు."

"అవును. అడుగు తున్నాను. ప్లీడరీ కోసమేనా నేనుగిరిని ఇవ్వదలుచుకున్నది ... ప్లీడరీకి కాదు...నీకూ నేను పిల్లనివ్వదలచు కున్నది."

బాబూజీ నిశ్చయం మీద సత్యా హృదయం గాఢ్గర్యం వహించింది. అతను తనహృదయాన్ని వెలు వరించ దలచుకున్నాడు.

"ఒక్క సంగతి బాబుగారు. మాఊళ్లో పిల్లఉంది. నాతోపాటు పెరిగింది. ఆ అమ్మాయికి నిశ్చయమైతే నేను పెళ్లి చేసుకుంటాను.

నేను విలాసాలు అనుభవించటం - మా ఇంటి

ప్రక్క పిల్ల కుమిలి పోతూవుండటం – నేను సహించ లేనండి"

బాబుకు ఇటువంటి మాటలంటే ఇష్టమే. కాని ఇవ్వన్నీ భ్రమఅని ఆయన తాత్పర్యం! ప్రపంచంలోమంచి తనం ఎక్కడెక్కడ పనికివస్తుంది! అడుగడుకు అవసర ముంది. నీమంచితనాన్ని శంకించే వాళ్ళు లక్షలాదిగ బైలు దేరుతారు అందుచేత కిమిన్నాస్తిగా ఊరుకో టమే మంచి పని. ఇదిబాబు వుద్దేశం కాని ఎవడైన ఒకమంచి తెలివి తక్కువ పనిని చేయదలచుకుంటే చేయనీ, తనకేం అభ్యంతరం?

"అయితే ఆ అమ్మాయి విషయం ఏంచేస్తావు?"

ఎక్కడన్నా ఆ అమ్మాయికి పెళ్లి అయిపోతే బాగుంటుంది"

"మంచిది"

బాబూజీ మౌనంవహించాడు. ఈ పరమార్థానికి బీహారీని తయారు చేస్తున్నట్లు గ్రహించాడు బీహారీకి సంతుష్టికలిగితే, తనకే అభ్యాంతరంలేదు. కాని తను ఇంకా కొంతకాలం ఓపిక పట్టాలి. పసితనం ఇంకా కొంత వదలాలి.

తాను అనుకున్న చోటికే, తిరిగి తిరిగి వచ్చాడు వస్తాడు. అందులో తనకేమీ సందేహంలేదు. తుఫాను వస్తుంది. విఱుచుకుని తినే తుఫానువస్తుంది, ప్రపంచం ఎగిరిపోతుందనిపిస్తుంది. కాని చివరకు కొంచెము, ఇసుక, చెత్తతప్ప మిగతా ఏమీఎగురవు. తుఫాను వచ్చివెళ్ళి పోతుంది. ప్రపంచం తనపనిలో తానుప్రవేశిస్తుంది. అదే

ప్రకారం జీర్ణంకాని అభిప్రాయాలతో ఈ తుఫాను వచ్చింది. వచ్చివెళ్లిపోతుంది. సత్యా మామూలుదారిలోకి రాకపోడు.

## ౧౦

కాశ్మీరం స్వర్గం. అందలి ఉద్యానాలు అతిరమణీయాలు. దానిలో నిబిడిచ్ఛాయితోనున్న ఒకవృక్షం క్రింద అందరూ కూర్చునిఉన్నారు. బైటసరస్సులో పడవ ఆగివుంది. కూర్చున్నచోట మఖమల్లుపట్టులాంటి పచ్చిక చాలాదూరం వ్యాపించిఉంది. ఎదురుగ్గా పిల్లకాల్వ సంక్షోభంగా ప్రవహిస్తోంది. చిన్నచిన్న చేపలు ఎగిరి గంతులువేస్తున్నాయి. ఆ కాలువ చలువరాతిమీద చరచరాపోతూ, గుడుసుళ్లు పడుతూ మెలికలుతిరుగుతూ ప్రవహిస్తోంది. షాజహాను చక్రవర్తి సౌందర్య కల్పనాధార జలాకారాన్ని పొంది తరంగమయమైన నీలివసనాన్ని ధరించి మనముందర తన గమన చాతుర్యం ప్రదర్శిస్తోందా అన్నట్లుగావుంది.

ఈస్వార్గిక సౌందర్యాన్ని గరిమకళ్లతో త్రాపుతోంది. తనహృదయంమీద చిత్రించుకోటానికి ప్రయత్నిస్తోంది. ఇంతమనోరమదృశ్యం తనకెక్కడ లభిస్తుంది. నీళ్లుపరుగెత్తుతూంటే విపిన్ ఎట్లాఊరుకోగలడు.

"మనం షికారుకు వెళ్లుదాం" అని సత్యాతో అన్నాడు. అతడు ప్రతివిషయంలో సత్యాతోనే చెప్తాడు. ఎంచేతంటే సత్యా తనమాట కాదనలేడు. వేలుపట్టుకొని

అతను విపిన్‌ను, షికారుకు తీసుకెళ్లాడు. అంతా చూపించాడు, తిరిగివచ్చేటప్పటికి విపిన్‌కు జేబునిండా, రాళ్లూ, పూలే!

ఈతనసంపత్తిని చూపిద్దామని పరుగెత్తుకునివస్తే చెట్టుక్రింద ఎవ్వరూలేరు. ఇంతలో సత్యకూడావచ్చాడు. అటూఇటూ చూచాడు. విపిన్ తనఖజానా అంతా పచ్చికమీద పఱచి దాన్ని జాగ్రత్తగా చూస్తూ ఉన్నాడు, సత్యహఠాత్తుగా చూచాడు. దగ్గఱనే గరిమ ఒక పొదలో ఆకులలోఉంది.

“చూడు విపిన్! అదిగో మీ అక్కయ్య విపిన్ తన సంపత్తిని చూసుకొని మురుసుకోటంలోనే మగ్నుడై ఉన్నాడు. ఉలిక్కిపడిలేచి తనఖజానా అంతాసర్దుకొని ఒకకేకవైచి గరిమవైపు పరుగెత్తాడు. సత్య అనుసరించాడు.

ఆమె తిరిగిచూచింది. విపిన్ అదేపనిగా పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. వెనుక సత్యఉన్నాడు.

విపిన్ చేరాడు.

“ఏమిటిరా! ఈచెత్త అంతాను!” అని జేబులు పరీక్షించటం ప్రారంభించింది. “బలేపని దొరికింది”

“చూడు ఇటువంటి పువ్వెప్పుడైనా చూచావా? ...ఈ రాతిలో ఎన్నిరంగులున్నాయి. ఒకటి...రెండు మూడు, నీలం, ఎఱుపు, తెలుపుకూడా”

“చూశావా! వీడిదగ్గిరఉన్న మ్యూజియమ్ అంటూ సత్యవచ్చాడు.

“ఎంతపిచ్చివాడు” అంది. పైన ఏమనాలో

తెలవలేదు. ఖజానాపరీక్ష ఐపోయింది ఎవడూ తన ఖజానాచూసి సంతోషించకపోతే పోనీ, తనే ఎందుకు సంతోషించకూడదు! విపిన్ అక్కడనే కూర్చుని తన మ్యూజియమ్ అలంకరించటం ప్రారంభించాడు.

సస్యశ్యామల మైన ఆప్రదేశం మీాద మరేమీా లేదు. అప్పుడప్పుడు గాలి కెరటాలలో ఆపచ్చని చీరె ఊగుతోంది. సందుసందుల్లో సన్నసన్నని వెల్లుకసబ కుతూ ఉన్నాయి.

సత్య ఇదిచూశాడు. పైకిముఖం ఎత్తాడు గరిమ ముఖం వంచుకుంది. తలమీాద చేరెచెంగు అస్తవ్యస్తంగా పడివుంది. జడలో ముంగురులు చిందర వందరగా వున్నాయి. అప్పుడప్పుడు ఒకానొక ఆకువచ్చి ఆముంగు రలలో చిక్కుకొని పోయింది.

పట్నంలో పెరిగిన సభ్యత తెలిసిన చదువుకున్న ఆ అమ్మాయి ఆవన్యరూపము మనోమోహకంగావుంది.

"గరిమా!"

ఉలిక్కిపడింది.

"ఎందుకు నుంచోటం! కూచోవు!"

సత్య కూచున్నాడు. ఆ అమ్మాయీ కూచుంది.

"బాబూ ఎక్కడకు వెళ్లాడు?—మరి బిహారీ?"

సత్య కంఠస్వరంలో ఆంతరిక మైన చిరునగవు చిన్నెలు కనిపించు తున్నాయి,

గరిమ హాస్య మనుకొన్నది. ఒంటిరిగా వుండ టాన్ని గూర్చి నవ్వుతున్నాడనుకుంది. లేచివెళ్లిపోబో యింది.

"ఏం"

"బాబు ఇక్కడనే ఎక్కడో ఉంటారు చూస్తాను"

"వద్దు కూర్చో బాబుకు కోపం రాదులే"

గరిమ సిగ్గిలి పోయింది. సత్య ఇదేమిటి ఇట్లా మాట్లాడాను అనుకున్నాడు.

"రా గరిమ నేనింకా కొన్నిమాటలు మాటలాడాలి. లేకపోతే మనం పరస్పరం అపార్థం చేసుకుంటాం."

గరిమ మెదలకుండా కూచుంది.

"గరిమా! నేను ప్లీడరీ చేయటంలేదు. నీతో ఈ సంగతి చెప్పటం అత్యావసరం. చెయ్యాలనే సంకల్పంకూడా లేదు ఏంచేస్తానో! చెప్పలేను. కాని ఎప్పుడో ఒకప్పుడు చాలా ధనం, ప్రతిష్టా సంపాదిస్తాననే ఆశ కూడా లేదు. ఇది మనమంతా తెలుసుకోవాలి"

"ఈ విషయంతో నాకేంసంబంధం?"

"నీకు ఈ విషయంతో ప్రత్యేకసంబంధంఉంది."

బాబు ఉద్దేశ్యమేమిటో నీకు తెలుసునా? కాని నన్ను నేను చాలా అయోగ్యుడనుగా భావిస్తున్నాను."

"తమరు ఇష్టంవచ్చినట్లు చెప్పగలరు. నాకు ఇటువంటిమాటలు వినాలనే కుతూహలంలేదు"

"నువ్వుకాకపోతే మరెవ్వరు వింటారు. స్పష్టం ఉన్నదిఉన్నట్లు చెప్పివెయ్యటం నా కర్తవ్యం. నేను ధనవంతుణ్ణికాదు. కాబోను మొదటిమాట ఏమిటంటే... నీ నా జీవితపంథాలలో చాల వ్యత్యాసం కనబడుతోంది. మరోమాట!..."

గరిమ ఓపికగా వింటోంది,

"ఆమాటేమిటంటే బాబుకి నేనేమీ చెప్పలేక పోయ్యాను. ప్రస్తుతం ఏమీఅనుకోకుండా వుండటమే శ్రేయస్సు."

ఆమె తీవ్రంగాఅంది.

"నన్ను అవమానించటానికి మీకు సాహసం ఎట్లావచ్చింది?"

సత్య ఏమిటో తెలుసుకోలేకపోయాడు. నిర్విణ్ణుడయాడు.

"నేను తమరినిగురించి ఏమనుకున్నాను. నాతో ఈమాటలన్నీ ఎందుకు తమరుచెప్పటం? నన్ను అవమానించాలనే సంకల్పం మీకుఉన్నా అధికారంమాత్రం లేదు. సత్య ఈ దృష్టితో అసలు ఆలోచించనేలేదు. గరిమ యొక్క విచారపరంపర గ్రహించి, నిజంగా తెలివితక్కువపని చేశాననుకున్నాడు. ఆ భావాన్ని పోగొట్టటానికి తయారు అయ్యాడు.

"నేను... నే...ను."

కాని మధ్యలోనే విన్నాడు.

"తమకు నామీద పూర్తిఅధికారం ఉందని మాత్రం ఎప్పుడూ అనుకోకండి, అట్లా అనుకుని మోసపోవచ్చు."

సత్యగొణగటం, నీళ్లు నమలటం ప్రారంభించాడు కాని ఏమంటాడు...

"కట్టో సంగతి చెప్తారా ఇప్పుడు?"

కట్నో! దానిసంగతి ఈ అమ్మాయికెట్లా తెలుసు ఇదంతా బీహారీ దౌష్ట్యం!

"తమరు కట్నోను ఎట్లాఎరుగుదురు?"

"తమరు అనకండి నీవు అంటేచాలు అంత నాగరికత అక్కర్లేదు. తమరు నాగరికతకు అతీతులంఅనుకుంటూవుంటారు...కట్నోసంగతి చెప్పండి. నాకెట్లా తెలిసింది. అది వేరే విషయం"

అతడు గ్రహించాడు! ఒక బస్త్రీ పిల్లతనను ఎట్లా నిరుత్తరుణ్ణి చేయగలిగింది! వాళ్లిరువురు ఒంటిరిగాఉన్నప్పుడు ప్రపంచనియమం ఏమీబాధించనప్పుడు తనకంటె అనేకవిషయాల్లో ఆఅమ్మాయిదే పైచేయి అమెను ఓడించాలనే తీవ్రత కలిగింది అతనికి!

"పల్లెటూరి అమాయకపు పిల్ల ఆ పిచ్చి పిల్లను గురించి ఏమి వింటావు?"

"బలేపిచ్చిది! కాస్త ఆ పిచ్చితననేవింటాను.

"ఊహూ! ఊరుకోండురూ?"

"ఆదిండుకూడా ఆపిచ్చిలోదేగా?"

అతను ఉలిక్కిపడ్డాడు. మాట ముదురుతోంది. పరిశోధనలో గూడా గట్టి పిల్లే! దిండు సంగతికూడా పసిగట్టింది! నాకేం తనమీద అధికారంలేదు! తన అధికారంతో నాచుట్టూ ప్రాకారం కూడ కట్టుతోంది. ఎంతమట్టుకు లోబడటం –

"అవును అయితే"

"అయితే! ఎంతచల్లగా అంటారు ఆమాట "సరే

పోనీండి" — కొత్తగా రేకెత్తిన బిక భావంతో ఆమె మొఖం ప్రదీప్తమైంది.

"నేనూ అట్లాగేఅయితే!"

"నువ్వు అట్లాకాలేవు"

"కాగలను అదికూడా గ్రహించ లేవు"

"తమరు" నుంచి ఎప్పుడు "నీవు, లోకివచ్చిందో అతను గ్రహించ లేక పోయాడు.

"ఎట్లా!"

"ఇట్లా!"

అని వెంటనే పరుగెత్తుకొనిపోయి ఒక చెట్టుఎక్కి కూచుంది. కోతి తనలో ప్రవేశించిందా అన్నట్లు! సత్య ఆ చెట్టుక్రిందికి చేరాడు. చేరగానే అతని తలమీద ఎండిపోయిన ఆకులూ, చిన్నచిన్న కొమ్మలూ, వర్షించాయి.

"ఇప్పుడేమంటావు"

సత్య అన్నాడు "ఇప్పుడు నేను పశ్చాత్తాప పడుతున్నాను."

పశ్చాత్తాప పడితే లాభంలేదు. కట్టోను ప్రపంచంలో సర్వస్వంగా భావించకు. దిండుకావాలంటే నేనిస్తాను. తీసుకో. ఒకటితయ్యారుగానేవుంది"

సత్య అనుకున్నాడు ఆపనేచేస్తుందని, తనుకట్టోనుమఱచిపోవచ్చునని.

గరిమ దిగింది. విపిన్‌ను వెంటతీసుకుంది. నవ్వుతూ పేలుతూ ఒకచేత్తో విపిన్‌ను, మరోచేతితో సత్య

పూతీసుకొని, ఎగురుకుంటూ చక్కాపోయింది తోట గుమ్మంలోకి వెళ్ళి మొఖంమీద వేలు వేసికొని అంది "ఇక నిశ్శబ్దం!"

గరిమ పడవలో చేరింది. బాబు, బిహారీఅక్కడనే వున్నారు.

కాశ్మీరంనుంచి తిరిగివచ్చి బిహారీ పెండ్లి సమ కూర్చటానికి, సత్య మొకామెకీ తనవూరు జేరాడు.

## ౧౧

వచ్చి యెంతో సేపు కాలేదు. అప్పుడే కట్టో పరు గెత్తుకుని వచ్చింది. జుట్టు చిందరవందరగావుంది, చెమట పోసినముఖం మాసిఉన్న చీర... రొప్పుతూఉంది! చేతు లుపిండి అంటుకునివున్నాయి.

"వచ్చావు!"

"ఆ! వచ్చాను."

"చాలాదబ్బునవచ్చావు? సెలవుఇచ్చారూ?"

"అవును. ఇప్పుడు సెలవే"

"మంచిది. నేనిప్పుడేవస్తాను రొట్టెచేసుకుని. అమ్మకు వంట్లో బాగాలేదు. అందుచేత నేనే రొట్టెచే యటం. విన్నాను. అట్లాగే పరుగెత్తుకునివచ్చాను. కోప పడకు. ఈ తడవ,..ముచ్చటగా వస్తాను." అంటూనే ఎగిరిపోయింది చిలుకలా. మాష్టరుగారు ఆలోచనలో పడిపోయారు. స్వగతంగా 'కట్టో' ఎంతకాలం నువ్విట్లా ఉండిపోతావు? అమాయకపుపిల్ల! నీ సమక్షంలో ఏము న్నదీ నీవేరుగవూ?... అవును ఎరుగకుండా వుండటమే

మంచిది. లేకపోతే అవిచ్ఛిన్నరోదనంతప్ప మరేమి వుంటుంది.

మాష్టరుగారు సంకల్పిస్తే ఊరుకోలేరు, కాని బిహారీసంగతి ఎలాప్రస్తావించడం? పాపం! తనకేసిగ్గుగావుంటోంది.

కొద్దిసేపట్లో కట్టో తిరిగివచ్చింది. అదే వైఖరిగా వచ్చింది.

"ఈవేళ మాయింట్లో భోజనంచేద్దువుగానిపద. అమ్మతో నేనుచెప్పివచ్చాను." ఎటువంటిపిల్ల! అమ్మనడిగికూడా వచ్చింది! తనసంగతిచూచుకోలేదు. సమయం అవునాకాదా అన్నవిచారమేలేదు! మనస్సుకు తట్టింది. చేసివేసింది—ఒకఆలోచనలేదు, మంచిలేదు, చెడ్డలేదు, వెనుకలేదు ముందులేదు.

మాష్టరు :— పద.

వడ్డిస్తూఉన్న సమయం, తనప్రసంగానికి మిక్కిలి అనుకూలమని మాష్టరుగారు అభిప్రాయపడ్డారు.

భోజనసమయం! చాలమంది ఆతిథ్యం అతను అనుభవించాడు కాని ఇక్కడ ఆతిథ్యమర్యాదే కనబడటంలేదు. అమ్మపడివున్నది. సహాయం చెయ్యలేదు. కట్టోతిన్నగా పొయ్యిదగ్గఱకు వెళ్లింది. పెనంవేసింది. నిప్పురాజేస్తూ రాజేస్తూఅంది.

"కూర్చోకు పళ్లెంతీసుకో"

మాష్టరుగారికి తానై పళ్లెంతీసుకోవలసివచ్చింది. వెళ్లిఒకచోట చదికిలపడ్డాడు. "ఇది తొట్టె. ఇక్కడ

నిల్చున్నాయి" ఆగుంజీలుకూడా తీసాడు. కాని అంతా అందంగానే ఉంది. ఇటువంటి తమాషాపని కావాలనుకున్నా అన్నప్పుడూ లభించదు.

"నారొట్టెమాడిపోతుంది. లేకపోతేనే నేఇస్తాను."

"నేనే తీసికొంటాను."

"కాస్తపళ్లెం ముందుకు తీసుకురా...అరే... పొయ్యికి కాస్తదూరంగా... వుండు"

"నిర్బంధంచాలావుంది!"

"అమ్మంది నేను అంతనిర్భందించను. పెద్దవాళ్లు చెప్పినట్లు చెయ్యాలిగదా!"

"కాదని నే నెప్పుడన్నాను?"

"ఎప్పుడూ అనకు తెలిసిందా!"

మాష్టరుగారికే నీతులు చెప్తూంది. ఉపాధ్యాయురాలై కూచుంది. మాష్టరు గారికి కూడా యీ శిక్ష అమృత ప్రాయంగా వుంది!

బంగాళా దుంపల కూర, పరోటాలు ఇచ్చింది. ఇంత పప్పు, ఊరగాయ కూడ ఇచ్చింది. కాని శిష్టాచారానికైన క్షమాయాచన కోరలేదు. 36 పిండివంటలతో వంటజేసి పెట్టి సగర్వంగా నిలుచుండి నట్లు!

"కూర ఇంకా కొంచెం వేసేదా! ఆకలితో వుంటే ... ఒట్టు!"

మాష్టరుగారు చాలా ఆప్యాయంగా తిన్నాడు. ఆయనకు రుచించలేదనడం,మహా పచారం!

మాస్టేరు గారు తన ప్రసంగం తీసుకురావాలనే తొందరలో ఉన్నాడు.

"కట్టో మా మాటకూడావిందూ!"

"వింటున్నా ... ఈ పరోటా తీసుకో ...ఏమంటావు ?"

"పొట్టను భాధించడం మంచిదికాదు! ... నాకు ఒక స్నేహితుడు వున్నాడు"

"నేను తింటూంటే, పరోటా మాడిపోతే !"

"నేను వెళ్లానా ! నా వెంటనే వుండేవాడు"

"ఎవరు"

"మా స్నేహితుడు "

"ఎవరా స్నేహితుడు ... ఎక్కడ ... ఆగు, ఆగు ... నా పరో..."

"నువ్వు వినడమే లేదు."

"వింటున్నాను. చేతిలో పని అయిపోతే శ్రద్ధగా వింటాను."

మొదటిలోనే ఇట్లా తనప్రయత్నం విఫలమై పోవడం శుభంగా కనపడలేదు సఫలత సిద్ధించకపోతే..?

పని అంతా పూర్తిచేసుకొని కట్టో వచ్చింది. కొత్తచీరె కట్టుకుంది. జుట్టు చక్కగా దువ్వుకొంది సిగ్గుతోవచ్చి కూచుంది. ఎందుకో సిగ్గుకూడ మాట కట్టుకొని వచ్చింది.

మాష్టరుగారికి అనుకూల సమయంగా కనపడ లేదు. కాని ప్రయత్నం చెయ్యాలికదూ !

'యత్నే కృతే యది...'

'నువ్వు ఏదో చెప్తున్నావే!' కట్టో ప్రారంభించింది.

"మరే కట్టో! ఒకవిషయం నీతో చెప్పాలి."
మాష్టరుగారు అదోరకంగా చూసాడు. కట్టో కొంచెం భయపడింది.

"కట్టో! నీస్నేహితురాలు సరోమా ఎక్కడకు వెళ్ళింది?"

"దానికి పెళ్ళి అయిపోయింది. అత్తవారింటికి వెళ్ళింది."

"చినోంజీ?"

"దానిపెళ్ళి మొన్న వైశాఖంలోనే అయింది. తెలవదు నీకు?"

"కట్టో!"

ఏదో చెప్పదలచుకున్నది కంఠంవరకు ఆగిపోతు వుండటం కట్టో గ్రహించింది. ఇప్పుడామాట వచ్చే తీరాలి..."ఏమిటి?"

ధ్వని సన్నగిలిపోయింది...ఎవరైనా వింటారో ఏమో క్షమింపమని కోరుతున్నట్లుగా సత్యముఖంనుండి మాటలు వెలువడినాయి.

"కట్టో! నీ పెండ్లి?"

కట్టోకి అంతరాంతరాల్లో గ్రుచ్చుకున్నది యీ మాట.

నిస్తబ్ద దేవతలా కూచునిపోయింది. మెల్లిగా మెల్లిగా, మెల్లిమెల్లిగా కళ్ళు ఎత్తిచూచింది!...

అవేకండ్లు! రెప్పలువానిమీద వ్రాలి ఉన్నాయి ఆర్ద్రి ఆర్ద్రింగావున్నాయి. తిరిగి మెల్లిమెల్లిగా రెప్పలు సాంతం వ్రాల్చింది. కండ్లక్రిందికి దింపింది...

ఏమైనా చెప్పు. కట్టాకి అదేమీ పట్టలేదు.

"కట్టా! నాకు ఒక స్నేహితుడున్నాడు. నాఅంతే చదువుకున్నాడు. మేమిద్దరం కలిసి చదువుకున్నాం. చాలామంచివాడు, కట్టా...నామాట విను... చాలామంచి వాడు. తండ్రి ప్లీడరు...డబ్బుగలవాడు. చాలా పెద్దమనిషి. కట్టా!...వాడు నిన్ను రాణీనిచేసుకుంటాడు ఆ విషయంలో నాది పూచీదారీ కట్టా!... కట్టా!... నువ్వు...ఒప్పు...కుంటే!"

కట్టో ఏంచెప్తుంది? ఎట్లా చెప్తుంది. ఆమెదగ్గిర ఆకండ్లేఉన్నాయి. వాటిని ఎత్తగలదు. దించగలదా, అంటే వాటిల్లోనే చదువుకో ఏంవ్రాసిఉందో. అదే ఆపిల్ల ప్రత్యుత్తరం! "కట్టా! నామాటవినవూ! నా ఒక్కమాట! ... దానినే నిరాకరిస్తావా! ... తిరిగినీతో చెప్పవలసినమాటే ఉండదు."

జవాబు ... కేవలంమౌనం ... కండల్లో వైవశ్యం. ఆర్ద్రిత ... జవాబు తెలుసుకోటంలో ఎవడు పొరపడతాడు ...

"నీవు విషయం తెలుసుకో, అబ్బే, నీవు తెలుసుకోలేవు ... నీ సమక్షంలో ఏముందో అర్థమేకాదు. ... ఈ క్షణందాటితే పశ్చాత్తాపపడతావు. నన్ని ఏమీప్రయోజనం వుండదు"కండ్లుచెప్పాయి "నేను ఎవరినీ ఏమీఅనను. కాని నువ్వు ... నాతోఇటువంటి మాటలు చెప్పకు."

"సరే, నీ యిష్టం. దేవుడు నిన్నురక్షించుగాక!"

ఇరువురూ మౌనవ్రతులు. భయానకమైన ఆనీరవతను పోగొట్టి కట్టా అడిగింది.

"వెళ్ళనా ?"

"వెళ్ళు"

"వెళ్ళనా !"

"వెళ్ళు."

"వెళ్ళనా ?"

"వెళ్ళు"

ఆమె వెళ్ళిపోయింది.

## ౧౨

మనస్సులో సంకల్పం, తిరిగి వికల్పం పునస్సంకల్పం, పునర్వికల్పం ... కాని తిరిగితిరిగి సంకల్పం వస్తూనేవుంది.

కట్టాయొక్క శూన్యమైన భవిష్యత్తు కండ్లయెదుటనుండి తొలగిపోవటంలేదు. ఎంత హాహాకారంతో నిండివుంది... మరితను ! విలాసాన్ని ఆ మంత్రిస్తున్నాడు.

అయినా ఇంకొకసారి ప్రయత్నంచేసి చూడాలి. అతడు పిల్చాడు. ఆమెవచ్చింది.

సందెచీకట్లు దట్టమౌతున్నాయి. కాంతులు క్షీణించి పోతున్నాయి. గదిలో గడియారం కూడ నిశ్చేష్టంగా వుండిపోయినట్లున్నాయి. సత్యా ఒకకుర్చీలో కూర్చుని వున్నాడు. అతడూ జడజగత్తులో ఒకభాగంగా

వుండి పోయాడు... అతడు నిశ్చేష్టుడు - నిస్పందుడు. గాలికెరటం ప్రవేశించి నట్లుగా నిరపేక్ష భావంతో కట్టో ప్రవేశించింది. వచ్చినిలబడి పోయింది.

సత్య ఒక కిటికీ తెఱచాడు అస్తోన్ముఖుడైన సూర్యుని అరుణ కిరణం కట్టో ముఖమండలాన్ని భాసింప చేసింది. పరిసర ప్రదేశంలో వున్న వస్తువులను చూస్తూ వుంది. ఆమె మొఖం తళ తళలు చిమ్మింది.

సత్య చూచాడు-కండ్లు అశ్రుస్నాతాలు. ఉబికి వున్నాయి. వికసించిన కమలం పరిస్నావమైనప్పుడుండే రెండురెక్కలులాగా వున్నాయి. ఆమెరెప్పలు లోపలి భావాల్ని మఱుగు పరుస్తున్నాయి బలవంతంగా. సత్య దృష్టి ఆనేత్రకవాటాల వరకు వెళ్లివెనుకకు వస్తోంది. లోపల ప్రవేశించే తాహతు దానికిలేదు. నేకు సత్య లోపల చొరబడి మర్మాన్ని కొల్లగొట్టదామనుకుంటాడు!

నేడు ఈఅతిమానుషమూర్తి ఈఅంధకారవాతావరణంలో సత్యయొక్క ఆత్మకు ఒక తెల్లని కిరణం ఆముఖాన్ని పర్యాప్తం చేసింది.

సత్య ఒకసారి దృష్టిసారించాడు. మరిభయపడి పోయాడు. కట్టో ముఖం కాదది - తద్భిన్నం - చంచలత లేదు, ప్రగాఢగాంభీర్యంతో నిండివుంది, బాలోచిత ఔత్సుక్యమునకు బదులుగా స్నేహాభిషిక్తమైన ప్రణకాంతుతో, విహ్వలతను వర్ధిస్తున్న ఆముఖం కట్టోది కానేకాదు! ....

"ఏమిటి ?"

"నామాట విన్నవా? కట్టో"

"వింటాను. అన్నిమాటలు వింటాను. ఇంతే కాదు"

"మరి"

"మఱి అడుగకు... నేను అభాగ్యురాలను."

"కట్టో పూర్తిగా చూచింది. నిండుగా నిబ్బరంగా చూచింది.

సత్యయొక్క సర్వావయములలో ఒక అలౌకిక దీప్తి వ్యాపించిపోయింది.

"కట్టో! నన్నుచూడు...చక్కగాచూడు."

"చూస్తూనే వున్నాను."

"పోనీలే ఆ మాటలు!... నేను నీకు చాలా కష్టము కలిగించాను. ఇప్పుడు దానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను."

"వద్దు వద్దు."

"ఏమంటావు .... నన్ను ... నన్ను ... ఏమంటావు?'' ఏమంటుంది? సూర్యుడు అస్తంగతుడై పోయినాడు. ఆ చీకట్లో, ఆమె తనమాష్టరు పాదాలమీద వ్రాలింది. పాదముల ఆశ్రయందొరకగానే వాటికి అశ్రుజలంతో అభిషేకంచేసింది.

## ౧3

సత్య అక్కడవుండలేకపోయినాడు. అతని అంతరంగంలో లేచిన అల మధువేదనంతో కూడిన తుఫా

నుగా మీరింది. అతడాగదిలో వుండలేకపోయ్యాడు, పాదాలు కన్నీళ్లల్లో స్నానంచేస్తూవున్నాయి మనస్సు, దేహబంధనంనుంచి ముక్తమై, ప్రవహించిపోవాలనుకుంటున్నది. గదిలోంచి బైటపడ్డాడు. తెలియదు, ఎక్కడికివెళ్లాలో, ఏంచెయ్యాలో! దగ్గరలోనే గంగకాలువ ప్రవహిస్తోంది. అక్కడికేచేరాడు. పైన తల్లిచీరపైటలా అపారమైన ఆకాశం వ్యాపించివుంది. గాలి మెల్లిగా వస్తోంది, తల్లి ఉచ్ఛ్వాసనిశ్వాసములులా. దగ్గిఱలోనే ఆజలధార రోదనం! పిల్లల దుఃఖాలుచూచి తల్లిహృదయం కరగిప్రవహిస్తోంది. తల్లి ఒడిలోకివచినట్లైంది. మిగతా ప్రపంచంఅంతా నిద్రామగ్నంగా వుంది. సహస్రతారలతో తల్లివాళ్లకు పరిరక్షచేస్తోంది....అతనికి కొంచెం మనశ్శాంతచిక్కినట్లైంది. జ్ఞానం పునః ప్రాప్తమైనట్లైంది. జీవితంలో కొండశిఖరంనుంచి జారిపడ్డ అతను అలిసిపోయాడు. నిద్ర అవసర మనిపించింది. అతడింటికి వెళ్ళి నిద్రపోయ్యాడు.

*　　　*　　　*

ఇక్కడ కట్టో సౌభాగ్య పర్వతం క్రిందపడి స్పృహ దప్పిపోయింది. స్పృహ తెలిసేటప్పటికి మాష్టరుగారు లేరు. ఒంటెరిగా నేలను తడువుతూ పడివుంది . . . లేచింది, దట్టమైన అంధకారం, ముసుగు పైచికొని తడుముకుంటూ, తడుముకుంటూ దర్వాజా వైపు వెళ్ళింది.

ఎవరూ చూడరుగదా! ఈ సౌభాగ్యాన్ని ఎవరు చూడకూడదు, సిగ్గుల మూటయైపోయింది. శరీరం కిం

చిత్తు గూడ బైటకు కనబడ కూడదు. ఈ సౌభాగ్యం తోతను ఎక్కడైనా సమాధి అయిపోయినా తన కిష్టమే సర్వావయవములు కుంచించుకొని కుంచించుకొని. ఇంట్లో కిగంతు వేసి వెళ్ళిపోయింది. దీపం వెలగించి మంచం మీద పండుకున్నది. రాత్రంతా శివరాత్రి అయింది. నిద్రపోటానికి ఆమె ప్రయత్నమూ చెయ్యలేదు. భావాం బరవీదుల్లో విహరించింది. ఆమె మనస్సు ఒకప్పుడూ భూమిని తాక నేలేదు.

తన మనస్సు వికసించి వింత ఆహ్లాద కరంగా వుంది. యావత్తు ప్రపంచాన్ని తన ఉత్సాహంతో, తన ప్రేమతో ఆప్లావితం చేసేస్తుందేమో.

రాత్రంతా మేల్కొని ఆమె ఒక నిశ్చయానికి వచ్చింది, పర్వడిరోజున తానుకూడా పర్వడికి వెళ్లే ఏర్పాటు చేసుకోవాలి.

ఏమితీసుకొస్తుంది ? . . . ఎర్రనిగాజులు, బొట్టు పెట్టుకునే డబ్బీ – . . . జ్ఞాపకంలేదు, ఎట్లాచెప్తుతుంది .... సిగ్గుకూడ వస్తుంది. రేపు చూసుకోవచ్చును.

ఇంకొక్కవిషయం, గంగకు పర్వడివచ్చినప్పుడే తనజీవనంలోనూ పర్వడి ఆకస్మికంగా వచ్చింది, ఆ నిస్సందేహంగా ఇది గంగాపర్వడిమాహాత్మ్యమే.

రాత్రిగడచింది. ఇరుగుపొరుగున ఉన్న పావు కారుస్త్రీలతోపాటు తన ప్రయాణమూ స్థిరంచేసు కుంది.

# ౧౪

సత్య నూత్నప్రపంచంలో మరునాడు మేల్కొన్నాడు. నిన్న గడచిపోయింది. నేడు సరికొత్తరోజు. ఈ కొత్తరోజు అతనికి అనేకపనులు తెచ్చిపెట్టింది. నిన్నటివిషయం విస్మృతంగా పడివుంది. నిన్న జరిగిందేమిటో జరిగింది, అది కేవలం అవ్యక్తంగా మసక మసకగా వుండిపోయింది. దాన్ని తిరిగి స్పష్టంగా చూసే సావకాశం లేదు. అతనికి అతడెన్నో పనులు చక్కబెట్టుకోవాలి మరి!

అయినపనులు అయిపోతూవుంటే, కొత్తపనులు వస్తూవుంటాయి.

అసలు అతనికి నిన్నటివిషయం స్మృతిలోకి తెచ్చుకోవాలనిలేదు. కాని అది అన్నిటినీ త్రోసిరాజనిముందుకువచ్చి నిలబడుతోంది. ఆఘటన ప్రత్యక్షమైతే సత్య కంపించిపోతున్నాడు. అందుకే అతను అనేకపనులు కలిపించుకొన్నాడు. కాని ... బలవంతంగా తెచ్చుకున్న వ్యాపృతి ఎంతసేపుంటుంది? భోంచేసి తనగతిలోకివచ్చాడు. నిన్నటి ప్రతిసంగతి అచ్చుగుద్దినట్లు ప్రత్యక్షం కావటం మొదలుపెట్టింది. ఆలోచించుకొన్న కొలదీ నిన్నటి విషయాన్ని అతడే నమ్మలేకపోయాడు. తనను గురించి తనకే సిగ్గువేయుట మొదలుపెట్టింది. తననిజాయితీమీద తనకే సందేహం కలిగింది.

బిహారీని గురించి మాట్లాడటానికిగదా వెళ్ళింది. అదేమో జరగనేలేదు. బిహారీ ఏమనుకుంటాడు ...

నేనేమి చెప్పాను ? నన్ను చేసుకుంటావా అనేగా ? కట్టా యేడ్చింది ఒప్పుకుంటుంది. కాని నాతో అనలేదే! అయితే నేను దానిని పెళ్ళిచేసుకొనేదా ? ... చేసుకో వాల్సివస్తుందా ?

ఆలోచించాడు. విచారిస్తే, అల్లాగే జరిగే టట్లుంది.

అప్పుడు చాలావిషయాలు ఈ సంగతిని ప్రతిఘ టింప మొదలు పెట్టాయి ... బాబు ... గరిమా! బాబు దేముంది? .... మరి గరిమ ! సరే! చూద్దాం .... కాని .... కాని. ?

ఈ "కాని"లో చాలామాటలు ఇమిడి ఉన్నాయి చాలా విచిత్రంగానే వుంటుది. లోకులేమంటారు. గ్రామంలో మనకు గౌరవం, ఆదరణ ఏముంటాయి. ఇదంతాఎట్లా ? మఱి ... కట్టోతల్లి ... మఱి మా అమ్మ

పూర్తిగా ఆగిపోయాడు. అతనికి దాటలేని ప్రతి బంధము వచ్చిపడింది.

అమ్మ కెట్టాగూ ఇష్టముండదు. కానివ్వదు. వింటే చచ్చి పోతుంది. పిల్లవాడికి స్వాతంత్ర్యము ఇచ్చిందే గాని అధర్మాన్ని కండ్లారా జూడలేదు. చచ్చి పోతుంది ఇందులో సందేహం ఏమీ లేదు. చావుకు సిద్ధంగావున్న దాన్ని చేతులారా మృత్యువుకు అప్ప గించేదా ?

కాని ... కాని నిన్న ఏమైపోయింది! మరి కట్టా ?

పొద్దుటనుంచీ, కట్టోను చూడలేదే అనిపించింది. ఇప్పుడే వెళ్ళి కట్టోకు స్పష్టంగా చెప్పాలి .... వెళ్ళాడు .... పిలిచాడు .... కట్టో, కట్టో, తల్లి – "ఎవరు ?"

"నేను"

"రా నాయనా లోపలికి"

కట్టో గంగా స్నానానికి వెళ్ళినట్లు తెలిసింది. కట్టో తల్లి జీవితం రెండో ఒడ్డు చేరబోతున్నట్లు గ్రహించాడు. పాపం! తెలియదు. తల్లినికూడా కట్టోనుంచి ఎప్పుడు లాగేస్తాడో.

"అబ్బాయి! పిల్లగంగకు వెళ్ళింది. ఇప్పుడు నాలో శక్తివుడికి పోయింది. చేతులు వణుకుతున్నాయి బ్రతుకంతా పనిపాటలతోనే తెల్లవారింది. ఇప్పుడు చేతులు కాళ్ళు స్వాధీనం తప్పాయి. పిల్ల గంగకు పెళ్లి కపోతే ఏం! కాని దానియిష్టము. చాలాసార్లు చెప్పాను ప్రపంచములో తలవంచుకుని తిరగాలి, నాతరువాత నీకు దిక్కెవరూ లేరు. అప్పుడు తెలుస్తుంది. నేను చెప్పింది అని. దాంతో ఏడవటం మొదలు పెడుతుంది.

అమ్మా! నువ్వు అలా అనకు. నీ ఎదుట నన్నా నన్ను నా యిష్టంవచ్చినట్లుండనీ .... తరువాత నాకు స్వేచ్ఛ ఎట్లావుంటుంది, అటుంది. అబ్బాయీ! అది విచిత్రమైనపిల్ల. వెక్కి వెక్కి ఏడుస్తుంది. నాకాళ్లల్లో తల పెట్టి ఏడుస్తుంది 'ఒక్కతన్ను తన్ను తల్లీ! నేను బాగుపడు తాను' అంటుంది. పదిరోజులనుంచి నేను పనిముట్టుకోటమేలేదు. అదే అంతాచేస్తోంది. ఒక్క కష్టంగాదు.

పైగా నా సేవ. అది పనిచెయ్యాలిసినరోజులా - ఇవినా యనా - శుభ్రంగా చదువుకుంటుంది, ఆడుకుంటుంది, ప్రతిపనీ, తీరుగాచేస్తుంది, ఇంకోకొంపలోవుంటే రాణీ అయియుండేది. ఏడిస్తే ఏంలాభం? అనుభవంతప్పదు. నేను దానినేమీ అనలేను 'గంగకువెళ్ళితే కాస్తమ నస్సు శాంతపడుతుంది. ఇంతపనిలో కొంచెం విశ్రాంతి కూడ ఉండవలసిందే. ఒక్కసంగతిచెప్పనా? నాయనా? చెప్పకుండావుండలేను. అదినిన్ను మహాభాగుడ్నా వుం టుంది. విసుగులేకుండా చెప్తుంది. స్వప్నంలో కూడా నిన్నుగురించే!... అబ్బాయీ! నాతరువాత కొంచెం దాన్నికనిపెట్టివుండు. నువ్వులేకపోతే నేను దానికి విషము ఇవ్వావలిసిందే. ప్రపంచంచాలా చెడ్డది. ఏంచె ప్పను? నీబోటివాళ్ళు చాలాతక్కువగా వుంటారు. నీబోటివాళ్ళమీద నే ప్రపంచం నేటికి నిలబడివుంది. నీలోనే నాకుధైర్యం."

ఈ విషాదగాధ సత్య కర్తవ్య విముఖమైన తన మనస్సుకి ఉపదేశసారంగా స్వీకరిస్తూ వింటున్నాడు. తన ఒకేఒక్క కూతుర్ని వదలిపెట్టి వెళ్లటానికి సిద్ధంగా వున్న తల్లిగుండెల్లోంచి వస్తూవున్న వెచ్చనమాటలు సత్యకు వరస్వరూపాలుగా వున్నాయి. భగవంతుణ్ణి, తగినశక్తి నియ్యవలసిందిగా ప్రార్థించాడు. సంకల్పం దృఢతరం చేయమని ప్రార్థించాడు. ఏవిషయం ప్రసం గించాలనివచ్చాడో అది కొట్టుకుని పోయింది.

కట్టొతల్లి — అబ్బాయీ! నీ పెండ్లి ఎప్పుడౌ తుంది. పిల్ల బాగాచదుకున్నదని వింటున్నాం. వాళ్ళు

ఇష్టంగానే వున్నారు. నీవే ఇంకా ఒప్పుకోటంలేదని విన్నాము. నిజమేనా ?''

పరమాన్నంలో లవణంలాఉంది- ప్రస్తావన సత్య మనస్సు చేదై పోయింది. ఎదో విరసంగా....ఇదా ఇక్కడకు నన్ను రానీకపోతే !''

" ఎటువంటిమాట అంటున్నావు "

" నేను పల్లెటూరివాడిని. ఆపిల్ల బస్తీది. "

" హుష్. "

" నేనిప్పుడు పెళ్లిచేసుకోను. చేసుకుంటానో లేదో చెప్పలేను. "

" నేను నాకోసం చెప్తున్నాను. నాయనా కట్టోకు వదినెగారు వస్తుంది. ఆ అమ్మాయి చదువు నేర్పుతుంది. మంచిపద్ధతీ నేర్పుతుంది. నేనంతా చెప్పి పోతాను. అమర్యాదగావుంటే, నరకివెయ్యండి. కాని బాగామాత్రం చూడండి. "

" కానున్నది కాకమానదు. అంతా మంచిగానే జరుగుతుంది. కాని చెప్తున్నాను. నీకట్టోకు రవ్వంత కష్టం కలుగనియ్యను. "

" కాదుకాదు. నీవు పెండ్లిచేసుకోనంతపర్యంతం కట్టోకు సంతోషంగా వుండదు. ఇప్పటినుంచీ అంటోంది. — నువ్వు పెళ్లిచేసుకుంటే ఆపిల్ల తనకుపాఠం చెప్తుందని, తాను సేవచేస్తు ఉండవచ్చునని. "

" ఆ " అతడు ఆమాటను నిరోధించదలచుకున్నాడు. అంతకంటే అదృష్టమైన విషయం జరగబోతోందని ఆవిడ ఎఱుగదా ? కట్టోకి ఏవిషయం అధి

శాధిక సంతోషాన్ని ఇస్తుందో ఆమె ఎఱుగదా? తను మాత్రం ఏమి మాటలాడగలిగాడు! ఈ విషయాన్ని గురించి ఆవిడ అభిప్రాయమేమిటో!

"కట్టాక్కి వదినెవచ్చి, కట్టోను ప్రేమించకపోతే తల నఱికివేస్తాను."

"కట్టో అల్లరిచేస్తే, దాన్నికూడా అంతేచేయాలి తెలిసిందా నాకు అప్పుడేసంతోషం."

ఆమెమాటలనుంచి అతనికి ధృఢిమ, స్వస్థచిత్తత లభించినాయి. అప్పుడు మఱికొంచెంసేపు ఆగి ఆవిడను బాగ సంతోషపెట్టి ఇంటికివచ్చాడు.

## ౧౩

మనుష్యుడు, సంకల్పిస్తాడు, దేవుడు భగ్నం చేస్తాడు — అని ఇంగ్లీషులో ఒకసామెత. పరిశోధన చేసి మనం ఇంకో నిర్ణయానికి రావచ్చు — పురుషుడు సంకల్పిస్తే స్త్రీ భగ్నంచేస్తుంది. అప్పుడుకూడా సామెతలో అయధార్థముగాని, నీరసత్వంగాని వుండదు. వాస్తవానికి, పురుషుడు రచించేదీ ఉండదు, పాడుచేసేదీఉండదు. రచించినా, భగ్నంచేసినా, స్త్రీయే యెక్కువగా చేస్తూవుంటుంది. స్త్రీయే వ్యక్తిత్వాన్ని ఇస్తుంది. ఇంటిని, కుటుంబాన్ని నిర్మిస్తుంది. జాతిని, దేశాన్ని కూడా, స్త్రీయేనిర్మిస్తుంది. మరి వీటినన్నిటిని భగ్నం చేసినా ఆవిడేచేస్తుంది. ఆమేఆనందం, ఆమేకలహం. పచ్చనిపచ్చికగాచేసిన ఆమే, ఎడారిగా తయారుచేసినా

ఆమెయే; పాలుగురిపించినా నెత్తురుపిండినా, అదే చేస్తుంది. మరమ్మతు చేయాల్సినా, ఆమెయే చేస్తుంది. ధర్మం స్త్రీమీదఆధారపడివుంది, నాగరికతకు ఆమెయే శేషన్లకు మూలంకూడా ఆమెయే. ఇన్నిమాట లెందుకు? ఒక్కమాటలో చెప్పాలంటే? ప్రపంచం ఆడుదానిమీద ఆధారపడవుంది. పరిశీలనాశక్తి ఉన్న వాళ్లు ఈవిషయాన్ని మౌనంగా అంగీకరించి ఊరుకుంటారు. ఆశక్తిలేనివాళ్ళు అంగీకరిస్తేనేమి, లేకపోతే నేమి!

సత్యం, కట్టో గరిమలమధ్య పరుగెత్తుతున్నాడు. ఏదో ఒకనిశ్చయానికి వచ్చేటప్పటికి కట్టో తల్లి భగ్నం చేసింది. అక్కడ ఏదోస్థిరంచేసుకుని ఇంటికి వచ్చేటప్పటికి తన తల్లి అందుకున్నది. అన్నం వడ్డిస్తూవడ్డిస్తూ తల్లి: "అబ్బాయీ! ఇక పెళ్లిచేసుకోక తప్పదు."

సత్యంనసకటం మొదలుపెట్టాడు.

"కాదు. చాలారోజులు ఓపికపట్టాను. ఇప్పుడు నువ్వు నామాటవినాలి."

"అమ్మా! నేను..."

"నేనూలేదు గీనూలేదు. నేనుచెప్పిందివిను"

"నేను చేసుకోలేను. నువ్వెరుగవు."

"ఏమిటెరగను?"

"ఏంలేదు ... కాని."

"పిల్లలో ఏమైనా లోపండుందా?"

"కాదమ్మా! ... కాని."

"మళ్లీ అదే. నేనెరుగుదును. పిల్లచాలా యో

గ్యురాలు. నీకుకూడా ఆ అమ్మాయి అంటే ఇష్టమేకదా, నేనింకోమాట వినదలచికోలేదు."

"అమ్మా! నేనుచేసికోలేను."

"ఎందుకని ... కాస్త చెప్పరాదూ?"

"అమ్మా! ... నేను."

"చేసుకోలేకపోతే నీయిష్టంవచ్చినట్లు చెయ్యి. నేనుమాత్రం ఇక్కడ ఎంతకాలం కూర్చోపోయ్యానా?"

తల్లిముఖం అప్రసన్నంగావుంది. దుఃఖంపొంగివచేటట్లుగావుంది. సత్య... "అమ్మా!"

"నేనేమిపాపంచేసానో! కొడుకు, కోడలూ అని చూసుకొని మురిసేభాగ్యంలేదు. నే నిట్లాగే దాటిపోతాను."

వెక్కివెక్కిఏడవటం మొదలుపెట్టింది. సత్య బైలుదేరపోయాడు ... ఎట్లా ఉండగలడు? భోజనం మానేసి లేచాడు, చేతులు కడుక్కొన్నాడు.

అప్పుడు తల్లి ఒకఉత్తరం అతనివైపు గిరవాటు వేసింది.

సత్యచూసాడు. అది బిహారీఉత్తరం. తల్లిపేర ఉంది. బిహారీ ఒకటిరెండు రోజుల్లో ఇక్కడకు వచ్చి వేస్తాడు. బాబు పెండ్లినిగురించి అన్నిసంగతులు తేల్చుకోదలచుకున్నాడు. అందుకోసమే బిహారీ రానున్నాడు.

సత్యమీాద మంచు గురిసినట్లైంది. బిహారీని ఏముఖంతో చూడగలడు? పెండ్లిసంగతేమి చెప్తాడు.

తలనొప్పితో బాధపడుతూ అతను మంచంమీద పడు
కుని నిద్రపోయ్యాడు.

౧౬

కట్టో గంగనుంచి మంచిమంచి వస్తువులు
తెచ్చింది. అమ్మదగ్గిఱకువచ్చింది.

"అమ్మా! నేను గంగకెళ్ళాను. నీకు కోపం
రాలేదుకద. కాని అమ్మా! ఈవాళ పర్వడిదినం.
తప్పక స్నానంచెయ్యాలి. ఇకఎక్కడికీ వెళ్ళను.

"అమ్మాయీ! ఏమీలేదు. నువ్వువెళ్లినతరు
వాత మీ మాష్టరుగారు వచ్చారు. నేను అన్నివిష
యాలూ చెప్పివైచాను."

"ఏమిటమ్మా!"

"మీవదినె దబ్బునవస్తె నువ్వు వదినెదగ్గిఱనే
చదువుతావని."

కట్టోదగ్గిఱ ఒకరహస్యమైన విషయముంది. అది
ఆమెకే తెలుసు! నిశ్చిష్టమైన తన అధికారానికి తాను
ఉబ్బిబ్బ్యారిపోయింది.

"అయితే! వారేమన్నారు?"

"ఏమన్నాడు! నీమాష్టరు చాలావింతమనిషి.
కట్టో! సరేచూస్తాను. ఇప్పుడే ఏంతొందర?' అన్నాడు.
బహుశా అతడక్లై వుండిపోతాడేమోకూడా.

కట్టో! మాష్టరు వింతవాడే. కాని ఆమెకేం తె
లుసు, ఆవిచిత్రత!

"కట్టో! నా మాటమీద ఏమన్నాడో తెలుసునా?

చదువుచెప్పటంలో కట్టోను ఏమన్నాఅంటే తలపగుల గొట్టుతాను. అన్నాడు"

కట్టో ఇకవినదలచుకోలేదు.

ఇవ్వాళ ఏం వండను? ... బియ్యమా!"

"నీఇష్టం."

ఆమె పరుగెత్తుకు పోయింది. పొయ్యి దగ్గిఱకు కాదు. తనగదిలోకి వెళ్లింది. అక్కడ నూనెతో తడిపి వున్న బల్లమీద ఇప్పుడె కొని తెచ్చిన ఒక బొట్టుపెట్టె, ఒక చిన్నఅద్దం, రాధకృష్ణుల చిత్రం. అట్లాగే మరికొన్ని, వస్తువులు అలంకరించి పెట్టింది. అక్కడకువచ్చి బొట్టుతీసి సన్నగా రెండుకండ్లకుమధ్యగా పెట్టుకుంది. చూస్తూ వుంది – ఎఱ్ఱని ఆబొట్టు ఎట్లా నల్లపడి పోతూ వుందో!

అప్పుడే అద్దాన్ని అవతల పారేసింది. చీరముసుగు వేసుకొని, పరుగెత్తుకొనిపోయి గదిలో ఒక మూల ముడుచుకుని కూచుంది! పాపం, సిగ్గువేస్తు వుంది.

"నేనెట్లావున్నాను. ఎట్లా కనుపిస్తాను? మాష్టరుగారుచూస్తే ఏమనుకుంటారు? .... చూడనేచూడదు నేను వెళ్ల నేవెళ్లను .... మరిపిస్తే! .... ఊహు .... నేను వెళ్ల నేవెళ్లను .... ఎట్లావెళ్లుతాను?" అప్పుడొక విషయం తట్టింది.

నేనువెళ్లితే, ఆయన కట్టోఅని పిలిస్తే! ఆయన

అంటే, ఏమీ ఆలోచించదు. అట్లాగే పిలుస్తాడు. ఆయన కట్టో అనిపిలిస్తే.... నేను చేతకానిదానినే"

ఈవిధంగా ఆలోచిస్తూ ఆలోచిస్తూంటే ఆమెలో తీవ్రత కలిగింది. మూలనుంచి లేచింది, పైముసుగు తొలగిపోయింది. జుట్టువిచ్చల విడిగా పడింది....అయితే నేమి ? కలము, సిరాబుడ్డి కాగితమూ, తీసుకొనివచ్చింది. మంచంమీాదకూచుని వ్రాయటంప్రారంభించింది. బొట్టు విచ్చలవిడిగావున్న జుట్టునుచూచి, వ్రాస్తున్న వృత్తాన్ని చూచి మౌనంగా తనలోతాను ఎట్లానవ్వుకుంటోంది!

# ౧౭

సత్య నిద్రనుంచి లేచాడేగాని అయోమయంగా వుంది. దగ్గరనే బిహారీఉత్తరం ముడుచుకొని పడివుంది. అతడు విచారగ్రస్తమైన మనస్సుతో దాన్ని తీసిచదివాడు. ప్రథమతః చదువుతున్నట్లు అతడులిక్కిపడ్డాడు.

ఏంచెయ్యటం! తల్లి చచ్చిపోతుందేమో?...బిహారీతో ఏంచెప్పను. అతడు మనసులో ఏమనుకుంటాడు.

మధ్యలో కట్టోవచ్చి ఎంతగడబిడ చేసివైచింది. ఆమె ఎవరు ? .... నాకేమిటి సంబంధం? నే ఆమెకేం ఇవ్వాలి.... నన్నెందుకిట్లా బాధిస్తాంది ?

ఎవరో చెవిలోచెప్పినట్లయింది

"ఆమె ఏమిబాధిస్తాంది .... ఇన్నిరోజులనుంచీ నీదగ్గిఱకు రానన్నారాలేదు. ఆమె నీతో ఏమీఅనదే.

తన రోజులు మెదలకుండా వెళ్ళదీసుకుంటోంది. అట్లాగే గడవుకుంటుంది. ”

సత్య చాలాచిక్కులోపడ్డాడు. ఉండిఉండి అనుకుంటాడు. నామీదభారాన్ని ఎక్కువవై చికొని దేవుడు పనికిఎందుకు అడ్డంవెళ్ళాలి. ఏమైనాకానీ. నేను మెదలకుండా ఉంటాను. కాని మానసక్షేత్రంలో పాదాలను అశ్రుసిక్తంచేస్తున్న కట్టో ప్రవేశిస్తుంది. “నువ్వేమైనా చెయ్యి” అనిచెప్తున్నట్లుగా అనిపిస్తుంది. అతనేమిచేస్తాడు. మెదలకుండా శిథిలమనస్సుతో ఉండిపోదాం అనుకుంటాడు.

కాని ఔదాసీన్యంతో ఏమీకాదు. ఫలితం ఒక్కటే బాబుగెలుస్తాడు. కట్టో ఓడిపోతుంది. బ్రతుకుబాటలో మొదటినుంచీ ఓడిపోతున్నదే తిరిగిఓడుతుంది. జయము, జయిస్తూ వస్తున్నవాళ్ళకే అవుతుంది. మఱి కట్టో తనఓటమితోనే యితరులజయాన్ని నీరసంచేసివేస్తుంది.

ఆలోచిస్తూ, అతనిబుర్ర గిర్రున తిరిగినట్లయింది. ఒకవైపు తనమాటను రక్షించుకోవాలి, కట్టోను రక్షించుకోవాలి. రెండోవైపు తనదర్జా తల్లిమాట మరి యితరసంగతులు మానుకోవాలి. మఱి కట్టోనునిజంగా తనే రక్షించాలా ?

“నేను నాతల్లిదగ్గఱకువెళ్తాను. పాదాలపైవ్రాలి అంటాను “అమ్మా! నేను చాలాకష్టం కలుగజేసాను. ఆజ్ఞాపించు ఇంక నీకు దుఃఖం కలుగజేయను” అని. ఇట్లా ఆలోచించుకొని అతడు తన తల్లిదగ్గఱకు వెళ్లటా

నికి కావలసిన ధైర్యం చేకూర్చుకోటం మొదలు పెట్టాడు.

అప్పుడే ముక్కుమీద మసి అంటించుకొన్న గోమటిఅమ్మాయి వచ్చి నిలుచుంది.

"ఏమిటి అమ్మాయి ?"

"ఇదిగో కాగితం" అని చెయ్యివిప్పింది.

"ఎవరిచ్చారు"

"ఆఅమ్మాయే" అని చెప్పి అమ్మాయి పరుగెత్తుకొని పోయింది. మూసిఉన్న ఆ బాదామికాగితం విప్పాడు.

"నాది....నాది ఒకమాటఉంది, తోసేసేసై కాదు. నన్ను ఇప్పటినుంచి 'కటూ' అని పిలువవద్దు. నాకు సిగ్గుగావుంది. పెండ్లిఅయింతరువాత నీ ఇష్టంవచ్చినట్లు పిలు. పెండ్లికాకమునుపు వద్దు నామీదఒట్టు.

—కటూ.

"నీవు అమ్మతగ్గిఱకు వచ్చావని తెలిసింది. ఎందుకువచ్చావు ? నామూలాన సందిగ్ధంలో పడవద్దు.

కట్టూ"

ఉత్తరం చదివి అతడు తనతల్లిదగ్గిఱకు వెళ్లటం మానేశాడు.

## ౧౮

బిహారీకి ఇంటియొద్ద మనస్తిమితంగా లేదు. అతడు కట్టూనుగూర్చి కల్పించుకొన్నమూర్తి లోలో

పల చక్కిలిగింతలు పెడుతోంది. అందుకనే తండ్రిని వుత్తరం వ్రాయమని ప్రోత్సాహించాడు. ఆ దోనెపం మీద అతడావూరు వెళ్లవచ్చు. బాబు ఇప్పుడు చాల రోజులు తటస్థంగా వుండలేడు. ఆయన సత్యాను వదులుకుంటాడేమోగాని యీసంవత్సరం గరిమను పెళ్లి చేయకుండా మానలేడు.

తాను ఎట్లాప్రవర్తించాలో అన్నీ ఆలోచించుకొని బిహారీ సత్యా గ్రామానికిగా బైలుదేరాడు.

కట్టా ఎట్లాఉంటుంది? ఎట్లా తటస్థపడుతుంది? ఆవిషయమై ఎన్నోకల్పనలు అతనిమనస్సులో ఉదయిస్తున్నాయి. చిటికిలు వేస్తున్నాయి.

అతడు తన కల్పనలను అన్యథా ప్రవర్తింపచేయాలని ప్రయత్నిస్తాడు. కాని ఏపాలంలోను, ఏపత్రికలోను, ఏపుస్తకంలోనూ ఆగకుండా అది యెకాయెకి కట్టాదగ్గిఱకువచ్చి వ్రాలుతాయి.

అతడా గ్రామానికి ఎప్పుడూ వెళ్ళలేదు. అయినా అన్నియేర్పాట్లు ముందేచూచుకున్నాడు.

కట్టా నీళ్ళుతోడుతూవుంటే – ? నన్ను చూచి ఏమనుకుంటుంది– ఏంచేస్తుంది?

మాష్టరుదగ్గిఱ చదువుతూకూర్చుంటే బలేబాగుంటుంది.

నేనావూళ్లోనే వుంటాను. ఒకకుటీరం నిర్మిస్తాను. పట్నంలోఏముంది– పట్నం ప్రపంచానికి ఒక ఆపద! ఆ అమ్మాయిని బస్తీపిల్లగా ఎప్పుడూ చేయను. మేము గ్రామంలోనే వుండిపోతాము– నేను కట్టా!

బాబు ఏమన్నావుంటే— "నాకీప్లీడరీ అఖ్ఖర్లేదు ప్లీడరీ జీవితంలో రసమేవుండదు. డబ్బు, క్లయింటు కచేర్కీ, మోసం, ఇవితప్ప, ఏముంది! నేను చక్కనిరైతుబిడ్డగా వుండిపోతాను అంటాను. నా ఇంగ్లీషు డిగ్రీని, పట్టాను వంకెకు వేలాడదీస్తాను. ఉరితీస్తున్నట్లు! నన్ను మెదలకుండా రైతుగా బ్రతుకనీయండి అని ప్రార్థిస్తాను. సంతోషమే సంతోషము. విచారమేలేదు. మానవత్వంతో నిండివుంటుంది. కృత్రిమత లేనేలేదు రైతుజీవితంలో. ప్రజలకుచెప్తాడు "డిగ్రీలు, సర్టిఫికెట్లు ఉంటేవుండనివ్వండి వ్రేలాడుతూ. కావాలిస్తె వాటిని అప్పుడప్పుడూ దులుపుతూవుంటాను. కాని నాకు నా రైతుజీవనమే మంచిది." నా ఆవు— ఆవును ఒకదాని తప్పకుండా వుంచుతాను. సరే నాకట్టో నాకు వుండనే ఉంది.

నాఆరోగ్య భాగ్యం తిన్నగావుంటే, కట్టోను కుటీరంలోనే ఒకమహారాణిని చేస్తాను. నాకు డబ్బు అఖ్ఖర్లేదు. అంతా సత్యాకుఇచ్చినా మహాబాగే. అతను దానికి తగిపోతాడు. నేనిట్లాగే హాయిగా ఉంటాను.

ఊరుచేరుకున్నాడు. పిల్లలు కొంతమంది దారిలో కలిసారు కాని కట్టోలేదు. తనబండినిచూస్తూ నిలబడి పోతుందేమో. కట్టోను ప్రప్రథమతః గుర్తించగలనని అతని పూర్తివిశ్వాసం.

సత్యా ఇంటికివెళ్లి "మాష్టరుగారు!" సత్యా నిద్రపోతూ వున్నాడు. తనవల్ల ఏ పనీ కాకపోతే నిద్ర పోతూవుంటాడు. "త్వమేవశరణంమమ" అని.

సత్య తల్లివచ్చింది. పై ముసుగు సర్దుకుంటూ. సత్య సమవయస్కుడుగా అన్నాడు. బిహారీయే కాదు కదా!

"ఢిల్లీనుంచేనా రావటం ?"

"అవునండి" అతడు తెలుసుకున్నాడు సత్య తల్లి అని వెంటనే పాదాలకు నమస్కరించాడు.

"నేను బీహారీని."

"అనేఅనుకున్నాను."

"సత్య ఎక్కడున్నాడు"

"పైన నిద్రపోతూవున్నాడు"

సామాను లోపలపెట్టించి అన్నాడు "నేనుపైకి పోవచ్చునా"

"తప్పకుండా. అవ్వేమెట్లు"

బిహారీకి చాలతొందరగావుంది కట్టాను గురించి. అతడు వెంటనే పైకివెళ్లిపోయాడు.

సత్య నిద్రలోవున్నాడు. లేపటమా ఊరుకోటమా. అయిదారునిమిషాలు చూచాడు. చివరకులేపక తప్పిందికాదు.

"మాష్టరుగారూ"

ఉలిక్కిపడి లేచారు మాష్టరుగారు.

"బీహారి! బీహారీ! నువ్వా!"

మాష్టరుగారికి నెత్తురుగడ్డ కట్టినట్లైంది.

బిహారీ — "అవును. ఇప్పుడేవచ్చాను. గాబరా పడకు. అచ్చంగా బిహారీనే. భూతాన్నికాదు. ప్రమా

ణంచేస్తున్నాచూడు. ” అని బుజంపట్టుకొని ఒక్కఊపు ఊపాడు.

సత్య తనలోకి తానువచ్చాడు.

“ రా — కూర్చో. ”

“ రానూ వచ్చాను. కూర్చోనూ కూర్చు న్నాను. ఇదేమిటి ఉసూరుమొగంగాఉంది. లే ఉషారు తెచ్చుకో. ”

ఇరువురు రెండు కుర్చీలమీద కూర్చున్నారు. మాట ప్రారంభం కాబోతోంది. బిహారీ అన్నాడు “ కట్టో ! ”

సత్య ప్రతిధ్వనించాడు “ కట్టో ! ” అతనిదృష్టి దూరంక్షితిజ రేఖల నొరసికొని ఎగురుతూఉన్న పక్షి మీదప్రాలింది.

## ౧౯

చెప్పదలచుకొన్నమాట ఎంతకాలం కంఠంలో అణచిపెట్టడం-కాని చెప్పటం చాలాకష్టం. ఆత్మగ్లా నిని కంఠంలోనే దిగమ్రింగి ఫ్రూరుకున్నట్లు ! సత్య ఇరు వురిమెడ నేరస్తుడే-ఇటు కట్టోకి, అటు బీహారీకి - ఇరు వురిని ఉత్సాహపరచాడు. ఇప్పుడు ఇరువురిమధ్యనుండి తాను తప్పించుకొని పోవాలని చూస్తూవున్నాడు. అయినప్పటికి కథంతా ఉన్నదున్నట్లు చెప్పివైచాడు.

కాని బిహారీ పురుషుడు- నిజమైనబిహారీ. కష్ట పడి తాను ఈక్షణంవరకూ నిర్మిస్తూవచ్చిన భవిష్య

త్స్వార్థాన్ని ఒక్కసారిగా సత్యకూలద్రోసాడు. మొదట ఉత్సాహపరిచిందీ అతనే. కాని ఇప్పుడు బిహారీ అభగ సాధ్యముందు సమున్నత ముఖంతో నవ్వుతూ డేకాని కించపడడు. ఆతనిసిద్ధాంతం నిజానికి ప్రపంచంలో ఎవరి మీద నెపంమోపటం అర్థం లేనిపనిఅని, సత్యా ఒకమాట చెప్పి దానినుండి జారిపోతున్నాడు.

''సరే నాసంగతి వదలిపెట్టు! ఇప్పుడు నువ్వేం చేస్తావు?"

"తల్లిని చంపలేనుగదా!"

బిహారీ గ్రహించాడు తన చెల్లెలి విషయమని. కాని బిహారీ సందిగ్ధాన్ని నిమిషంలో ఛేదిస్తాడు. అతడు తన జీవితాధర్శాలను ఒకనిర్ణీతపథంలో నిర్మించుకొని వున్నాడు. అతనిలో డొంకతిరుగుడు వ్యవహారమే లేదు. ప్రతివిషయము తేలికగా తీసుకోగలడు. అతని వ్యక్తిత్వము స్పష్టమైనది. ఒకవైపుగరిమ రెండో వైపు కట్టో- వీరిరువురి మధ్యనుంచి ఒక చక్కనిదారి తీసి బిహారి సత్యకు పథప్రదర్శకుడు కాగలడు.

"ఎన్నైనా చెప్పు. నన్ను నేను మోసగించుకో లేను."

"అదికాదు...కాని..."

"నన్నడుగుతున్నావా? నీవు. ఆత్మనువంచన చేసుకుంటున్నావు. దానినుండివచ్చే ఆత్మగ్లానిని, తల్లి, బాబూజీ గరిమ, వీళ్ళను చాటుచేసుకొని తప్పించుకో వాలని

''నీవు అన్యాయంచేస్తున్నావు బిహారీ."

"అట్లాగే అనుకో. కాని నీవుచేసేవి తక్కువ అన్యాయంకాదు."

"నేను కట్టుపడిపోయాను."

"మాటచేతనా?"

"కాదు. అంతకంటె ఎక్కువైన- కర్తవ్యంచేత.'

"కర్తవ్యంచేతనా? -ఓహో! అయితే మాటాడలేను. ఈశబ్దంముందర నేను దాసానుదాసుణ్ని. ఈశబ్దం యొక్క అద్భుత పవిత్రతను జ్ఞాపకంచేసుకొని చేతులు జోడించుతాను. కాళికామందిరంలోని పండాతో చెప్పితే దీనితోపాటు 'ధర్మం' కూడా ప్రయోగించుతాడు. ఎక్కడైతే 'ధర్మం' 'కర్తవ్యం' వినపడుతూ వుంటాయో అక్కడ చెవులుఅప్పగించి వింటంతప్ప నేనుచేయ గలిగింది ఏమీలేదు. విన్నావా?" బిహారీ ఇచ్చిన ఉపన్యాసాన్ని సత్య జీర్ణించుకోలేకపోయాడు. ఇంత వరకు అతను స్వయం గొప్పగా అనుకుంటున్నాడు. కాని బిహారీ ఏమీ ప్రయాసంలేకుండానే నాజూకు పరిస్థితుల్ని దాటివేస్తూవుండటం సత్యమనస్సుకు బాగుండ లేదు.

అన్నాడు. "బిహారీ! ఈ ఉపన్యాస ధోరణి ఎక్కడ నేర్చుకున్నావు?"

"లేదు. లేదు ... క్షమించండి. అయితే నీవు నిశ్చయానికి వచ్చేసావా?"

నిజానికి సత్య నిశ్చయానికి రానేలేదు. కాని బిహారీమాటలు అతన్ని నిశ్చయంవైపు తరిమాయి.

" అవును. అమ్మకు నేడే చెప్పి వేయవలెను. నీకు సంతోషించవలసే వుంటుంది. "

" అవునవును. ఎందుకుకాదు ? నేనువచ్చింది అందుకు. కాని ఒక మాట చెప్పు. – కట్టోకు నువ్వు చెప్పావా ? "

" లేదు "

" వేయీ ! చెప్ప వేయీ ! నీవుచాలా సోమరివి. ఈవిషయమై ఇదివరకే చెప్పిఉంచవలసింది. కానిఇప్పుడు చెప్పవద్దు. ఆపని నేనుచేస్తాను. కానిఒకపనిచేస్తావా ? "

" చెప్పు "

" ఒకసారి కట్టోను పిలిపించాలి, నా పరిచయం కలిగించాలి "

ఇరువురిమిత్రులు కూర్చునిఉన్నారు. తమ తమ ధ్యానంలోఉన్నారు. కట్టోరావాలసిఉంది. అంతా నిశ బ్దంగాఉండాలి. సమయం ఆగిపోయినట్లుంది. గాలి స్తం భించిపోయింది. సత్య బిహారీల ఉచ్ఛ్వాస నిశ్వాసములు మాత్రమే సచలవస్తువులు.

కట్టోవచ్చింది. ఛాయలాగా, నడచివస్తూవున్న మూర్తిలాగ ఎవరు ! మొకామొకి ఒక పొడుగుపాటి మేలిముసుగు వచ్చింది. దర్వాజాయొద్ద నేనిల్చుని అశ్రు వులు రాలుస్తూవుంది.

బిహారీ మనస్సులో సత్యను శపించుదామనిపిం చింది. సత్యమనస్సును ఎవరో మెలిపెట్టినట్లుంది. అంతా నిశ్శబ్దంగావుంది. ఎవరికీ మాటరాలేదు.

ముగ్గురి మనస్సులనుండి, అలక్షితంగా అవ్యాహతంగా బైలుదేరి ఆగదిశూన్యతలో ఏమేమి వ్యాప్తమౌతు న్నాయో ముగ్గురిప్రాణాలు సుఖంగాలేవు.

బిహారి తెప్పరిల్లాడు. సత్యజిహ్వాగాద్గదికం వరించింది. ఏడుపుతప్ప వచ్చేటట్లులేదు. అటువంటి విషమావస్థలో బిహారీ యేమార్గంచూపగలడు. అతడ న్నాడు. "బాభీ" సత్య వణికిపోయాడు. అతడు దయా భిక్షము అడుగడుగడా !

కట్టో, కదలకలిగితే కిటికీచాటు నీడలో అణిగి పోవాలి 'భాబీ' అన్నశబ్దం ఆమెను విద్యుత్తులా ఊపింది. ఆమె నిశ్చేష్ట.

'బాబీ ! ఇట్లాకాదు. నేను పోవుండనివ్వను.' అని దగ్గఱకువెళ్ళి రెండుచేతుల్తో అంచులు పట్టుకొని ముసుగు తొలగించాడు.

"బిహారీ ! అట్లాచేయకు, సిగ్గుపడుతు జాలిప డుము' చూడు ఆమె కంపిస్తూవుంది, ముణుచుకొని పోతూవుంది, సిందూరంలా పడిపోతోంది. మరేమీ సంభవించదుకదా !'

బిహారీ చూచాడు. ఫాలంమీద సన్ననితిలకం, జుత్తుచక్కగా దువ్వబడివుంది. చేతులకివున్న రెండు ఎఱ్ఱగాజులు తొంగి తొంగి చూస్తున్నాయి.

అతని మనస్సులో అనిపించింది. "సత్యా! నీవు పశువ్వి.

ఇప్పుడు సిందూరానికి ఈరంగు మిగులుతుందా.

తిలకం తిరిగి అలంకరించుకొంటుందా. ఈ పల్లెటూరి పిల్ల తిరిగి తన జుత్తు తాను సవరించుకుంటుందా?

*  *  *

బాబీ! ఇట్లాగే వుండిపోలేవు. నీ తుంటరి బీహారీ వచ్చాడు. నీకు తనపరిచయం కలుగుజేయాలను కుంటున్నాడు. పద అతని మాట విను."

మణిబంధం పట్టుకుని, పసివాడి ఉన్న ఆపిల్లను బీహారీ లాగుకొనిపోయి ఒక కుర్చీలో కూర్చోపెట్టాడు.

తిరిగి నెత్తురు ప్రవహిస్తూవుంది. సమయం వచ్చింది. మరి ఆమె కట్టో రాకుండాఉండ లేదు.

కట్టో మెడఎత్తింది. దృష్టికూడాపైకి ప్రసరించింది. కంటి తుదలందు స్నిగ్ధత్వం నిండిఉంది. కండ్లు స్త్రీత్వమును నింపుకుని వున్నాయి.

"నేనిప్పుడు పరాయివాడిని కాదు. నేనెవరను ఎందుకు వచ్చాను?" బిహారీ ఆ కండ్లల్లోంచి ప్రోత్సాహాన్ని పొందుతూ మాట్లాడు తున్నాడు. "చెప్పనా? మీ మాష్టరు గారికి దయ్యం ఆవహించి ఉంది కొద్ది రోజులనుంచి"

పెదవులు విప్పారినవి. గులాబీ రంగుతో వున్న బుగ్గలలో చిన్నసొట్టపడింది. ఆమె చిరునవ్వు నవ్వింది. "ఆభూతం పేరు "మౌనం' పట్టినవాడిని మొద్దుబార చేస్తుంది. దయ్యాలు వదలించడంలో నేను మొనగాణ్ణి. సంవత్సరాల తరబడిగా నేను ఈయనతో చదివాను. నాసంగతి అతనికి బాగా తెలుసు. దయ్యంపట్టిందని తెలిసి

పరుగెత్తుకునివచ్చాను. బాబీ! చూడు. ఇహదయ్యాన్ని దింపివేస్తున్నాను."

కట్టో నవ్వింది.

"మెదలకుండా ఎందుకు కూర్చున్నావు. లేకపోతే ఇతను నీదయ్యాన్ని వదలుకోడతాడు సుమా!" అతనినాలుక మరీమెలికలు తిరిగిపోతోంది. మాటాడాలి అనుకుంటాడు. మాటాడలేదు.

"అట్లాకాదు. ఒకపనిచెయ్యి. నీవటువెళ్ళు. నేనిక్కడ నుంచుంటాను. ఒకటి, రెండు, మూడు అంటాను ఒక్కసారిగా నేనూ నువ్వుకూడా మూడుఅనగానే చంకమధ్య చక్కలిగింత పెట్టుదాం. సరిగామధ్య అటు కాదు! ఇటుకాదు! వెనుకాకాదు, ముందూకాదు, సరిగామధ్య లేకపోతే భూతంమరీ ఆవహించిపోతుంది - తెలిసింది... కదూ!

సరిగా"

"అవునవును. సరిగ్గా"

"సరే అంటున్నాను. ఒకటి ... రెండు ... మూడు. ... సరిగా ... అంటున్నాను!"

సత్యా అరచాడు "ఏమిటి మీరు నన్నుతమాషా చేయదలచుకున్నారా?"

బిహారీ - చూశావా! దయ్యం పారిపోయింది. మాటాడకు నీపొగరుబోతుతనము కట్టిపెట్టు"

కట్టోకు నవ్వు ఆగడంలేదు. కట్లుతెగి ప్రవహిస్తోంది. బిహారీఅన్నాడు "చూడు, నేను అనలేదా! మందు పేరుచెప్పగానే పనిఅయిపోయింది!"

బిహారీని సత్య గద్దించాడు " బిహారీ "

కట్లో అంది " ఇహ భూతం పారిపోయింది. ఇప్పుడు మాటాడు."

సత్య ఇటువంగి " కట్లా ! "

ఇతరులముందు " కట్లా ! "

అంది " ఎవరిని కట్లాఅనడం ! నీకేమిమర్యాదా లేదా ! కట్లా కట్లా ! "

కట్లా విసరడంచూచి అతడెక్కడకన్నా వెళ్లి పడిస్తే బాగుంటుందనుకున్నాడు బిహారీ.

లేని స్తోమతి తెచ్చుకుని సత్యఅన్నాడు,

" కోప్పడకు. మరోపేరులేదాయె. ఏంపిలవను?"

" ఏమైనాఅను. నాకేం తెలవదు. "

" మంచిది ! ఇతను నా స్నేహితుడు నేను నీతో ఒకరోజున ప్రస్తావించానే - అతను ఇతడే. " మాట పొంతం కాకమునుపే కట్లా బీహారీవైపుచూసి " నీవు "

అంతట్లో మరేంభావంవచ్చిందో కట్లో అవగుంఠను వేసింది.

" బాబీ ! నిన్ను నేను సిగ్గుపడనివ్వను. అంటూ బిహారీ అవగుంఠనం లాగివేసాడు. కాని కట్లా మళ్లీ వేసుకుంది. బీహారీ " ఒకనిమిషంలో నీవు ముసలిదానివి కాడలచుకుంటే నాకేమీ అభ్యంతరంలేదు. కాని ఒక మాట నేను మీఇంటికివస్తే అన్నంపెట్టుతావుకదూ ? "

కట్లో తనమాష్టరువైపు చూచింది. చూపులో అనుమతి ప్రార్థనవుంది.

" ఆ! రేపుఉదయం రావాలి. జ్ఞాపకంవుంచుకో, మరచిపోవద్దు. వీరినికూడా తీసుకొనిరావాలి "

ఒకేపోష్టులో బాబూజీకి రెండు వుత్తరాలు. బిహారీ వ్రాశాడు "అంతా సంపన్నమైయింది, ముహూర్తం ఏర్పాటు చేయండి, సత్యకు అంగీకారమే. సత్య తల్లి మరీ తొందర పడుతోంది.

బిహారీ తంతుచూస్తూఉంటే సత్య మళ్ళీ తల క్రిందు లౌతున్నాడు. మళ్లా అనుకుంటాడు – నిర్లక్ష్యం గావుంటంలో కూడా ఒక సంగతి వుంది – అతడు బాబూకు వ్రాసాడు.

"బాబూ! బిహారీ వచ్చాడు. కులాసాగా వున్నాడు అతడు తిరిగి రావటంలో ఆలస్యమైతే మీరేమీ అను కోవద్దు. ఎన్నాళ్లకు వచ్చాడు. నేను మీ కొకపిల్ల విషయం చెప్పాను మీరు మరచి పోయివుండరు ఇటీ వల మరికొన్ని సందర్భాలు ఏర్పడ్డాయి. అందుచేత నేను ఆపిల్లను గూర్చి మరింత ఆలోచించ వలసివుంది. ఆవిషయములన్నీ నేను మీకు వ్రాయలేక పోయాను ఇప్పుడూ వ్రాయలేకుండా వున్నాను బహుశః బిహారీ మీకుకొంత వ్రాసివుండ వచ్చును. బిహారీకి నాపూర్తి హృదయాన్ని ఎల్లావిప్పి చెప్పగలను.

బిహారీ మీకేమి వ్రాసాడో తెలియదు. కాని నేను అప్పుడే పూర్తి అంగీకారాన్ని చూపించ లేకుం డావున్నాను. కొన్ని విషయాలలో ఆ పిల్లకు నేను బద్ధుడనై వున్నాను. తనను చేసుకుంటానని ఆపిల్ల భావి స్తూవుంది. ఈ అభిప్రాయాన్ని నేను త్రుంచివేయాలి

లేదా ఏదో విధంగా యీ అభిప్రాయం ఆమె మనస్సులో నుండి తొలగేటట్లు చూడాలి. మొదటి విషయం అసంభవం రెండో విషయం ఎట్లాగో తెలవటంలేదు. కాని అది జరగనంత వాట్టుకు నా స్వాధీనంలో నేను లేనన్నమాటే అందుచేత మీరే మీ ఒక నిశ్చయానికి రాకండి.

గరిమకు 'నమస్తే' విపిన్‌కు ప్రేమ

తమ

సత్య"

మనస్సు వలెనే అతని మాట కూడా పల్లటీలు కొట్టుతూవుంటుంది. టూకీగా రెండు ముక్కలలో చెప్పటం అతనిచేతగాదు. ఉత్తరం తర్వాత కూడా అతని మనస్సు ఆందోళనగా వుంది. బాబు ఏం జవాబు ఇస్తాడో తనను గురించి తాను నిర్ణయం చేసుకోలేదు. మరెవ్వడైనా నిర్ణయించిపెట్టాలి. తన మనస్సుకు నచ్చిన నిర్ణయాన్ని ఎవడైనా చెప్పితే వెంటనే స్వీకరిస్తాడు బిహారీ వినయం అతను (సత్య) ఎప్పుడూ ఇతరుల చాటుగోరుతూ వుంటాడు. నేరాలు వాళ్లమీద నెట్టి వేయవచ్చు!

బిహారీ కాలువనుంచి స్నానంచేసి వచ్చాడు. కట్టోయొడ్డుకు వెళ్లాలి. సత్య ఆలోచిస్తున్నాడు. "ఇష్టం వచ్చినట్లు చెయ్యి. నన్నుగురించి గరిమనుగురించి ఆలోచించవద్దు. గరిమకు ఈసంవత్సరమే వేరే ఎక్కడనైనా పెళ్లి చేస్తాను" అని బాబువ్రాస్తే! అప్పుడు నాసంగతే

ఛీ! ఇది బాగాలేదు. కానియ్యి చూద్దాం ...
బాబు ఏమివ్రాస్తాడో!

సత్య నేలమీద లెక్క ప్రకారం నడవాలనుకుంటు
న్నాడు. నాలుగువైపుల పరీక్షచేసి లాభనష్టాలగుణించి
ముందుకు సాగాలి. ఈలెక్కలో కట్టోవైపు రాబడిలేదు.
ఖర్చుతప్ప. గరిమవైపు రాబడి, ప్రతిష్ఠా ఖర్చులేదనే
చెప్పాలి. సుఖానికిసుఖం, రెండోవైపు ఖర్చే! మరి
వచ్చేది ఏమిటి? సత్య ఖర్చులంటే భయపడడు. కాని
అతడిప్పుడు ఆదాచూసుకొని ఖర్చుచెయ్యాలనుకుంటు
న్నాడు. తనకుమాలిన ధర్మం మొదలు చెడ్డబేరమూ
ఉంటాయా? మరి.

చాలా కాలం దోలాందోళస్థితిలో ఉన్నప్పటికీ
కార్యత్వాబుద్ధి వచ్చేటప్పటికి, తాను ఒక పిచ్చి ఆదర్శ
మును కల్పించుకొని తిరుగుతూఉన్నట్లుగా గ్రహిం
చాడు. బాబుకు తాను ఉత్తరంవ్రాసాడు. బాణంఎదురు
రాదుగదా అనికూడా భయపడుతున్నాడు. కాని ఇప్ప
టికీ ఆశా తంతువు పూర్తిగా తెగలేదు. చూడాలి
బాబు ఏంవ్రాస్తాడో!

కాలువలో స్నానంచేసివచ్చి బిహారీ, ఈకుర్చీలో
కూర్చుని సత్య ఎక్కడమునిగి ఎక్కడ తేలాడో తెలుసు
కోలేదు ఇప్పుడతను కట్టోదగ్గిఱకు వెళ్లాలి.

"సత్య. నీవుకూడావస్తావా?" ఆమె ప్రత్యే
కించి నిన్నుతీసుకుని రావలసిందిగా చెప్పింది.

"నేనురాను. నువ్వేవెళ్లు."

"ఆమె నామీద కోప్పడుతుంది."

"చెప్పు. తలనొప్పిగావుందని"

"నన్నిక్కడే పల్లెంముందు కూర్చోబెట్టి నీ తలనొప్పి విచారించటానికి పరుగెత్తివస్తుంది."

"ఏదో చెప్పు. కాని నేను రాలేను." "ఏమిటి సంగతి?"

"ఏమీ లేదు. కాని ... ఊరకేనే?"

"మంచిమాట నేనాలోచిస్తూనే వున్నాను. నీతో చెప్పాలి వెళ్ళొద్దని, నన్నొంటరిగా వెళ్ళనీ."

"అల్లాగే చెయ్యి."

సత్యన్నాయా మారిపోయాడు. ఇప్పుడతన్ని ఎవరు కట్టావైపు ఆకర్షింపకూడదు. అందుకనే అతడు ముక్తసరిగా "అల్లాగేచెయ్యి" అన్నాడు.

బిహారీ మరోఅంచులధోతీ కట్టుకున్నాడు. జుత్తు దువ్వుకున్నాడు. సత్య ఇదంతా చూస్తూనేవున్నాడు. బిహారీదుస్తులు తనదుస్తులుకంటే మంచివని, ఆకారంలో కూడా ఎంతో తనకంటె బాగావుంటాడనీ సత్య ప్రప్రథమంగా గ్రహించాడు. బిహారీ స్లిప్పర్లు తొడుగుతూ "వెళ్తున్నాను. నీతరపున క్షమాపణకోరుతాను. కాని నేను బాబీ వినాశనానికి వెళ్ళుతున్నాను. నేడు బాబీ అంతర్ధానమైపోయి, కొత్తరకంకట్టా వుద్భవించాలి. బాబీ! ఈ బిహారీవస్తున్నాడు. నేడు నాశనంచెయ్యటానికి నిన్ను ప్రపంచంనుంచి లోపం, విలోపం, సంలోపంచేసేస్తాడు. నీస్థానే ఒక తెల్లచీర ధరించిన, విధవా విశేషణయుక్తయై విడివడిన కేశజాలముగల, జగదంబికాస్వరూపను సృష్టిస్తాడు. ఆమెముఖంలో తెల్లని

నవ్వు చిందులాడుతుంది. ఆమె పల్లెటూరి అమాయిక త్వాన్ని పునికిపుచ్చుకుంటుంది. '' అన్నాడు. రెండు పాదాలు దగ్గరగావుంచి "అటెన్షన్' అనిఅంటాడు "చూశావా సత్యా! నేనుకూడా ఎటువంటి సాహిత్య భాషతీసుకుని అభినయం చేస్తానో. ఈ అభినయంలో, సాహిత్యాడంబరంలో బిహారీ ఏవుద్వేగాన్ని కప్పి పుచ్చుతున్నాడో ఎవడు చెప్పగలడు ?

బైలు దేరుతూవుండగా, ఆకస్మికంగా వచ్చిన రెండుఅశ్రుబిందువులను అతడు తుడిచివైచుకొన్నాడు. బిహారీ! నీవు ధన్యుడవు. ఏడవాలసి వచ్చినప్పుడు నవ్వి ప్రపంచాన్ని నవ్వించి ఎవ్వరూ ఎరుగకుండా కన్నీళ్ళు తుడుచుకుంటావు! కాని, బిహారీ! నీ యీప్రవర్తన ప్రపంచాన్ని మోసగిస్తె మోసగించవచ్చు. కాని నీ యీ రచయితను మోసగించలేదు. నీ యీ రచయిత నిన్ను చూస్తూ నెవున్నాడు. నిన్ను స్టడీచేస్తూ నెవు న్నాడు.

వెళ్ళు. కట్టోదగ్గిరకువెళ్ళు. ఆమె నీమిషతో మాష్టరుకొరకు ఎదురుతెన్నులు చూస్తూవుంది.

నవ్వుతూ బిహారీ, కట్టోయింట్లో ప్రవేశించాడు. ఎదురుగుండా కట్టోతల్లి మంచంమీద కూచునివుంది, ఇతన్ని ఎప్పుడూ ఆమె చూడలేదు. మెదలకుండావచ్చి

'' బీహారీ అమ్మా నన్నెరుగుదువా ''

శుభ్రమైనబట్టలు కట్టుకొని, శుభ్రంగా కనబడు తున్న ఒక యువకుణ్ణి చిరునవ్వులు చిందుతూ వున్న వాణ్ణి సమక్షంలో చూసింది.

" ఎరగను నాయనా "

" సరే చెప్తాను. ముందు పాదస్పర్శ చేయని య్యండి " అని పాదస్పర్శ చేశాడు. ఆమంచంమీదనే ముసలమ్మదగ్గిఱగా కూచున్నాడు.

" నేను సత్యాఇ టికివచ్చాను. నిన్న ఢిల్లీనుంచి. "

" ఢిల్లీనుండా ? "

" అవునండీ . "

" ఢిల్లీలో సత్య "

" అప్పుడు అక్కడనుంచే "

" మంచిపనిచేసావు నాయనా ... సత్య "

" నేను భోజనానికివచ్చాను. కట్టో నిన్న వచ్చి పిలిచింది "

" నువ్వుకట్టోను ఎట్లాఎరుగుదువు ? "

" ఆమె మాష్టరుగారిద్వారా. "

" అయితే నిన్నుపిలిచిందన్నమాట. అందుకనే ఉదయంనుండి దానికి తీరటంలేదు "

" అట్లాకాదు. మాష్టరునుకూడ పిలిచింది. అందుక తీరికలేదు. ఆతను రాలేదు. ఇద్దరబదులు నేనొక్కడనే తింటాను. "

" కట్టో చాలామంచిది నామనస్సుకు నచ్చినపని చేసిందది. మొదటే నువ్వు ఇక్కడకు రావలసింది "

బిహారీ కట్టో ప్రశంస మొదలుపెడుతాడు అహోరాత్రాలు ఏకంచేస్తాడు. అందుకని ఆమె మొదలకుండా వుంది.

" వెళ్లునాయనా! లోపలకు కట్టో! నీఅతిథి వచ్చాడు."

" ఎవరు?" ఎరుగు కాని తిరిగి తెలుసుకోవాలని అడిగింది. వంటింట్లో అడుగుపెడుతూ బిహారీ

" దాసానుదాసుడు బిహారీదాసు" అన్నాడు.

" అతనురాలేదా?"

బిహారీ మొండివాడు. అడిగ డు " ఎవరు"

కట్టో సంకోచపడింది – నిశ్శబ్దం –

బిహారీకి సత్యను తిట్టాలి అన్నంత బుద్ధిపుట్టింది.

" లేదు."

కంఠస్వరం నిరాశామయంగా వుంది. అడిగింది

" ఎందుకని?"

" ఊరికేనే! తప్పని సరిపని ఒకటివుండిపోయింది రాలేకపోయ్యాడు" నాతరపున క్షమార్పణ కోరవలసిందని చెప్పాడు.

" ఆరోగ్యం చెడలేదుగదా?"

" కించిత్తుకూడ చెడలేదు."

నేడు చాలాచాలా పదార్థాలు తయారైనాయి. మొదటినుంచీ అన్నీ సిద్ధంగావుంచింది. నీళ్లువగైరా. ప్రతిపనీ సవ్యంగావుంది. కాని తినటానికి-బిహారీ ఒక్కడే మరిమెవ్వరూలేరు. మాష్టరుకు కేవలం ఒకసారి ఆతిథ్యం ఇవ్వకలిగింది. అప్పుడు తనంతతాను నీళ్లు తెచ్చుకోవాలసివచ్చింది అతనికి ఎంత దుర్విపాకం ఇది!

కాని బిహారీ ఆవిషయమై ఆటే ఆలోచించుకోనివ్వడు. వచ్చి రావటంతోటే, సంభాషణా పరంపరసా

గించాడు. కట్టో భావపరంపర బిహారీవైపు మొగ్గసా గింది. తింటూ తింటూ బిహారీ

"బాబీ–బాబీ అని నేను నిన్న అనను. నువ్వు మాటమాటకు సిగ్గుపడుతున్నావు. నాకు నీకూ మరి ఒకసంబంధంకూడా వుంది – చెప్పేదా ?"

కట్టో గ్రహించింది. బిహారీ ఒక కలుపని కొయ్య దని ఇప్పుడుతన్ను ఏమేమి హాస్యంగామాటాడుతాడో! అందుకని తనకు వినపడనట్లుగా తనపనిలో తాను నిమగ్నురాలై వుంది. తనకు ఇతరవిషయాలు వినటానికి తీరికే లేనట్టు!

"అదిచెప్తాను. వింటానికి నువ్వు సిద్ధంకావాలి, ఇప్పుడు "కట్టో" అంటాను. అట్లా ఉలిక్కిపడకు. "కట్టో" చెడ్డమాటేమికాదు !"

"నువ్వు. నన్నేమీ అనటానికి వీల్లేదు."
"నాచుట్టరికం వింటే నేను 'కట్టో' అనటానికినువ్వు సమ్మతిస్తావు."

కట్టో దెబ్బలాడటానికి సిద్ధం. అతిథినికదా అనే సావకాశాన్ని కొల్లగొట్టుతున్నాడు బిహారీ కట్టోను కేవలం పసిపిల్లనుచేసి వేస్తున్నాడు.

"నువ్వు నన్నేమీ అంటానికి వీల్లేదు. తెలిసిందా ?" మాట వక్రించింది. స్పష్టంగా తనసంగతి చెప్పివేస్తేనేకాని సన్యామెనదారికిరాదు, లేకపోతే జన్మలోఎప్పుడూ కట్టోయెదుటకు వచ్చేఆస్కారముండదు... వెంటనే బిహారీఅన్నాడు.

"నువ్వు బిహారీని అర్థంచేసుకోలేదు, నీకు కొంచెం దుఃఖంకలిగించినా అతనంతటి దురదృష్టవంతుడు ఉండబోడు. అతడునిన్ను క్షమించమని కోరుతున్నాడు. అతనిమాటవింటే, అతన్ని కోపపడవు. ఎంత తొందరగావింటే అంతమంచిది. నమ్ము నీకు కొంచెం దుఃఖంకలిగినా— ... సరే! ఏమనుకుంటున్నావో!"

బిహారీబాబు! నాకేమీ తెలియదు. నన్ను మాత్రం ఎగతాళిచేయకు."

చెయ్యను. కాని ఏడుస్తూ ఏడవటంకంటె నవ్వి ఏడవటం మంచిది. అందుకే నవ్వుటాలుగామాటాడుతున్నాను. ఎందుకంటే మెల్లిగా నిన్ను ఏడవటానికి తయారుచేస్తున్నాను.

"నాకు నీమాటలేమీ అర్థంకావడంలేదు, స్పష్టంగాఎందుకు చెప్పవు?"

"తిండం అయినతరువాత చెప్తాను. ఆరోట్టె ఒకటియ్యి— కూర... అదికాదు... బంగాళాదుంపల కూర

తిరిగి ఎవరు ఏమీమాటాడలేదు. రొట్టెతిని లేచినతరువాత అడిగాడు "ఇప్పుడు నామాట చెప్పవచ్చునా?"

"వంటింటిపనిఅంతా అయింతరువాత అప్పుడు వెళ్ళకు. అమ్మదగ్గిర కూర్చునివుండు." మళ్ళీకొంచెం సేపుఆగి అంది "బిహారీబాబూ! నువ్వు ఎవడివైతేనేమి పెద్దమనిషివలెఉన్నావు. నీవిషయంలో నేనేమీ అప

రాధం చెయ్యను. ఏమైనా పొరబాటు జరిగితే మరచిపో నేను మరి పల్లెటూరి పిల్లను.”

బిహారి అత్మ వేదనతో కూడిన ఆ క్షమాయాచన ముందు నిలువలేకపోయాడు.

“అమ్మ దగ్గిర కూచుంటాను. అప్పుడే వస్తాను.”

వంటింటినుంచి బైలుదేరగానే “అవ్వా అవ్వా” అంటూ ముసలమ్మ దగ్గిరకు వెళ్ళాడు.

“తింటం అయిందా?”

“చాలా వస్తువులు చేసింది. నంజుకుంటు తింటే నే పొట్ట ద్విగుణం అయింది. పడుకోనిదే పనిజరగదు. పొట్ట చాల బరువుగా వుంది.”

ఆవిడ అంది “ఎండగా వుంది. మంచం అట్లా నేరేడు చెట్టుకింద వేసుకో. హాయిగా నిద్రపో.”

అతడు అట్లాగే పడుకున్నాడు. చెట్టుమీద సగం పండిన నేరేడు కాయలు చూస్తూ వున్నాడు. అతని తల మీద ఒకటి ఛటుక్కున పడింది.

“అవ్వా! మీ ఇంట్లో యిట్లా ఆకాశంనుంచి బాంబులు పడితే నేనిక్కడే వుండిపోతాను. ఇంటికి కూడా వెళ్ళనక్కరలేదు.”

“అరే! పడుకో! ప్రాణభయం లేదులే ఢిల్లీలో ఎప్పుడైన ఇట్లా పడుకున్నావా?”

“సరే! పోనియ్యి నాకేం! నేను పడుకుంటు న్నాను. నా తల పగిలిపోతే నువ్వే ఇవ్వవలసివస్తుంది.”

“అట్లాగే లే!... నిద్రపో!”

బిహారీ నేరేడు చెట్టుక్రింద, అవ్వ స్నేహచ్ఛా

యలో, కట్టాయొక్క స్వర్గగృహంలో పడుకుని నిద్ర పోయ్యాడు.

## ౨3

కట్టోగదిలో అక్కడనే నూనెతోతడిసిన అల మారుంది.

"నేను ఢిల్లీనుంచి సత్యకు వివాహసంబంధం తీసుకొనివచ్చాను."

"అయితే."

"అయితే. నీకేమీ సంబంధంలేదా ?"

"ఏంలేదు."

"నీవు గరిమఅనే పేరువిన్నావా ?"

"లేదు."

"ఆ నేను ఆమె అన్నను."

"మంచిది."

"కొద్దిరోజులక్రింద సత్య ఊళ్ళోలేదు. అప్పుడు మాతోనే అతనువచ్చింది."

"ఊ!"

"నేను అక్కడనుండి పెండ్లిసంగతి ఖాయంచేసు కోటానికివచ్చాను."

"ఖాయమైందా ?

"పూర్తిగా కాలేదు! కాని..."

"అబద్ధమాడుతున్నావు."

"అబద్ధమేమిటి ?"

పెండ్లిఖాయమైందని అబద్ధమాడుతున్నావు.

నువ్వు వృథాగావచ్చావు. "పెండ్లిఖాయంచేసుకోలేవు."

"అదేమిటి అట్లాఅంటావు?"

"నేను చెపుతున్నాను."

"కాని నువ్వు భ్రమలోఉన్నావు."

"భ్రమకాదు."

"అయితే?"

"కానేకాదు."

ఇంతవిశ్వాసం! సత్య ఈమెకు తగినవాడా! సత్య ఇంతటి నిశ్చలవిశ్వాసంతో ఇష్టంవచ్చినట్లు ఆటలాడుతున్నాడా! దివ్యవిశ్వాసాన్ని రేకెత్తించి మోసగించవచ్చా?

కట్టాకు మోసంతెలిస్తే ఏంకావాలి? బిహారీ అన్నాడు "పరమాత్మ నామాట అబద్ధముచేయుగాక. సత్య సందిగ్ధావస్థలో ఉన్నట్టు తేలుతూవుంది. అతడు బహుశః మా చెల్లెలినే చివరకు చేసుకుంటాడు... అట్లా డేకనబడుతోంది." "—?"

"అతను బంధనంలో వున్నట్టుంది, నువ్వు దాన్ని తెగగొట్టగలవు. కట్టా!"

"ఏమిటి అంటావు? నాబంధనమా? నేనేమి బంధాన్ని. నేనెప్పుడు బంధించానని ఇప్పుడు విప్పేది? బంధించిఉంచటానికి నేనెవతెను? నువ్వు ఇట్లామాట్లాడుతావేం?

నువ్వునాతో ఈవిషయాలు మాటాడుతున్నావు

నాబోటిదానితో ఇవ్వేమాటాడినా మాటాడకపోయినా ఒకటేనని నీకు తెలియదూ ? ”

“ నేను సత్యాను అడిగాను. మాటలాడాను. అతడు అన్నిసంగతులు నాతో విప్పిచెప్పాడు. అతనికి నీసంగతి లేకపోతే, అతనిమనస్సు ఎక్కడుందీ నాకు తెలుసు. ”

“ అతని సంతోషానికి నేనుబలిఅవుతాను. కాని నాతో ఇట్లా మాటాడకండి ”

బిహారీ, ఎవరికి ఏమినచ్చజెప్పాలి అనుకున్నాడో, ఆమె బేషరతుగా, కారణంవినందే, సర్వసం అర్పణ లేదా త్యాగంచేయటానికి సంసిద్ధురాలైంది ! కాని ఇంకావిడ మర్చి చెప్పటం గోరుచుట్టు మీాద రోకటిపోటులాంటిది! పుంజలో ఉప్పునూరడంవంటిది. కాని బిహారీ చెప్తూనే వున్నాడు.

“ సత్యాదేమీా తప్పులేదు. అతడు తనమాట నిల బెట్టుకుంటే తల్లిచచ్చిపోతుంది. ఆ ... కట్యో ఉపేక్షా భావంతో మౌనం.

“ అతనికేం ప్రతిష్ఠ ఉంటుంది ? జనులేమం టారు ? ”

కట్యో నిస్తబ్దత.

“మాబాబుద్వారా అతనికి ప్రతిష్ఠా, ధనం రెండూలభిస్తాయి. మరి నీద్వారా! ”

కట్యో కేవలం జడమూర్తి.

“నాచెల్లెలు బాగా చదువుకుంది. ఇంగ్లీషు తెలుసు పెద్దపెద్దవిషయాలు తెలుసు ... మరినీకు ”

కట్టో యథాప్రకారం

"నా చెల్లెలు అతనికి సంపూర్ణసుఖాన్ని ఇస్తుంది. నీవల్ల అతనికేమి సంతోషం ... అదెందుకు నువ్వు స్పష్టం చెయ్యకూడదు?"

కట్టో నిశ్చేష్ట.

బిహారీ చెప్తూనే వున్నాడు.

"సత్యతల్లి, గొప్పతనము, సుఖం, ప్రతిష్ఠా — మరి సత్యక్షేమం"

కాని చూడు చూడు కట్టో మూర్ఛితురాలై క్రిందపడిపోతూవుంది.

బిహారీ వెంటనే పట్టుకున్నాడు. సత్యామీద అతనికి చాలాకోపంవస్తూంది. సత్యా అక్కడవుంటే అతన్ని కట్టో పాదధూళిలో లిప్తంచేసి యుంచును.

దురదృష్టవంతుడు. అస్పృష్టమైన ఈ దివ్య వారిపారిజాత సౌరభ్యాన్ని జుష్టంచేసి వదలివేయపోతున్నాడు.

కట్టోను మంచంమీద పరుండపెట్టాడు, కొంతసేపటికి ఉపచారంద్వారా స్పృహవచ్చింది, కట్టో లేచి చూచింది. బిహారీ పరిచర్యచేస్తున్నాడు!

"బిహారీబాబు! మీరు వెళ్ళండి. అతనితో చెప్పండి. తనవిషయాల్లో కట్టో ను లెక్క చెయ్యవద్దని. నాకొరకై అతను లవలేశంకష్టపడినా నేనోర్చుకోలేను. నాకోసం క్లేశాన్ని అనుభవించటానికి నేనెవతెను? లేకపోతే నేనే అతనితో చెప్తాను. కృతజ్ఞతాభారం ఇంతగా పెట్టవద్దని చెప్తాను. నాకోసం లెక్కచెయ్య

వద్దు. నీసుఖంకంటె నాకు కావాలిసింది లేదు. ఈ దేహంగ
మైతే నేనసలు భరించ లేను – అని చెప్పాను ... బిహారీ
బాబు, మీరు వెళ్లండి. చాలకష్టం కలిగించాను మీకు.
కాని నేను చాలాసుఖాన్ని అనుభవిస్తున్నాను. చాల
రోజులకు తనుకూడా త్యాగంచేయగలదు అని తెలుసు
కున్నది. అతనికి ఏదో విధంగా ఉపయోగించటమే నా
జన్మకు చరితార్థత. అతనితో చెప్పండి "కట్టోను నమ్ము"
కాదు. నేనే చెప్తాను లెండి"

బిహారీ "ప్రపంచంలో అందరు సత్యాలే కారు.
బిహారీలుకూడా ఉన్నారు. నీకుమల్లే ఏమీ ప్రత్యపేక్ష
లేకుండా ఇవ్వగలిగిన పురుషులూ ఉన్నారు."

"కాదు అందరు అతనికిసరి కాలేరు. అతనేమి
చేసినా సరిగానే చేస్తాడు. ఇవ్వటం పుచ్చుకోటం గొడ
వే లేదు అతనిదగ్గిఱ"

"కాని"

"అతనిని నీవు అర్థంచేసుకోలేవు."

బిహారీ ఏమీ మాటాడలేకపోయ్యాడు. ఈపిల్ల
విశ్వాసం! ప్రళయంవచ్చినా! హిమాలయాలు పడిపో
యినా చలించదు! ఏమైనాసరే! దృఢవిశ్వాసాన్ని
చూసి అతడు స్తంభీభూతుడైనాడు. కొంచేంసేపు
నిశ్శబ్దం ... తిరిగి

"పరమాత్మతో నేనుమాటాడటంలేదు. మాటా
డితే అతన్నికూడా 'నువ్వు' అనేవాణ్ణి. ఏమి నిన్ను
'కట్టో' అనకూడదూ ?"

"నీయిష్టం. ఏమన్నాఅను. 'కట్టో' యే సరిగ్గా

వుండి." శాస్త్ర అంజాయించి "అసలు అతన్ని కలుసుకోవాలి ముందు."

"ఏమైనా చెప్పు. నేను 'కట్లో' అనే అంటాను. నువ్వు కోపగించుకోకూడదు. బిహారీమీద కోప్పడితే ప్రసన్నం చేసుకోటం అతనికి తెలుసు. వెళ్ళున్నాను."

"వెళ్లు. కాని ఆయనతో ఏమీ అనకు. నేనే వస్తాను"

బిహారీ విస్మయవిక్షోభాలు మూట గట్టుకుని వెళ్లాడు.

## ౨౪

సత్యబాబు ఉత్తరం కోసం ఎదురుచూస్తున్నాడు. బిహారీకూడ ఉత్తరంకోసమే ఆగాడు. ఒకే పోష్టులో రెండు త్తరాలువచ్చాయి. సత్య బిహారీకి అతనిఉత్త రాన్ని శంకాకళంకిత నేత్రాల్తో ఇచ్చాడు.

సత్య తన ఉత్తరాన్ని ఉద్వేగంతో నిండిన గుండెతో ఏకాంతంగా తెరచాడు. చదివాడు.

"అబ్బాయీ! సత్యా! నీఉత్తరము అందినది. నీవు బుద్ధిమంతుడవు. నీఅంతట నీవే నిర్ణయించుకోవాలసిఉంటుంది. నువ్వాపిల్ల క్షేమం కోరుతూ వుండే యెడల నేను కాదనేవాడినికాదు. గరిమకు మరోవరుణ్ణి వెదకటంలో నాకేమీ ఇబ్బందివుండదు. కాబట్టి అందును గురించి నీవేమీ విచారించ నక్కర్లేదు. కాని ఒకవిధంగా నాకిది సంతాపకరమైన విషయం నీ సంబంధాన్ని

గురించి మొదటినుంచీ నేనే మోజుపడ్డాను. నిన్ను నా బిడ్డగా ప్రేమిస్తూవచ్చాను. కారణం నాకే తెలియదు. నువ్వాక్కడే చిక్కుపడిపోతుంటే పోనీలే. నాకేమీ నష్టం లేదు. కాని నీకే అపారమైన నష్టం కాని నువ్వు అందుకు నన్ను మాత్రం నిందింపలేవు. నీదురదృష్టానికి నీవే బాధ్యుడవు.

"సత్యా నాకీవయస్సు నిర్నిమిత్తంగా గడచిపోలేదు. కొంత ప్రపంచాన్ని కూడా ఎరుగుదును. ప్రపంచం మైన పుస్తకం కాదు - పుస్తకమూ కాదు చదివి అవతల పారవేయటానికి అడుగడుగుకు ఎదురు దెబ్బలు తగులుతూవుంటాయి. పట్టు, విడుపులూ రెండూవుండాలి. మనస్సును సమాధాన పఱచుకోలేనివాడు, ఇతరుల వీలు సదుపాయాలవెంబడి తాను తగ్గి నడచుకోలేనివాడు, ప్రపంచంలో ఏమీసాధించలేడు. అటువంటివానికి జీవితంలో సౌఖ్యమేలేదు. యీ విషయాన్ని నీవు గుర్తించాలి. ఎవ్వడూ యిక్కడ కేవలస్వతంత్రుడూ, ఏకాకిలేడు. అట్లా అనుకునేవాడు బాధ్యతనుండి పారిపోయే పిరికిపింద అనిపించుకుంటాడు. అందరూ తమ తమ బాధ్యతల్లో చిక్కుకొనివున్నారు. జంజాటం అను కర్తవ్యమును దానినుండి నీవు పారిపోలేవు. అట్లా పారిపోయిననాడు నీవు నీజీవితాన్ని ఎడారి మాత్రమే చేసుకుంటావు.

సత్యా, ఇప్పుడు నువ్వు సందిగ్ధంలో ఉన్నావు. ప్రేమకు జీవితంలో సరియైనస్థానం ఇవ్వలేకపోయావని తెలుస్తోంది. అందుకనే యీ బాధంతా. నువ్వాపిల్లను

ప్రేమించావా?- నేనంతే అనుకుంటున్నాను. సాయమాన్ని కోరే ప్రేమ సమాజానికి అవసరం. ప్రేమలో- ఇదినాది, నాదే నాదే అయిపోతుంది - అనే అధికార భావముంటే అది సంకుచితమైన ప్రేమ అని తెలుసుకో. స్వచ్ఛమైన ప్రేమ అనుభవాన్ని కోరదు. అది ప్రేమిక సంతోషానికి, ఆనందానికి తహతహ లాడుతుందే గాని, దానిని స్వాధీనం చేసుకోవాలని వెంపర్లాడదు.

వివాహమంటే ఏమిటి? వివాహం సంఘ సమస్య. సంఘతత్వం ఇందులో వుంది. మరో విధంగా భావిస్తే నువ్వు పొరపడుతున్నావన్నమాట. జీవితాంతంలో పెనవై చుకున్న కొన్ని బాధ్యతలకు నెరవేర్చటానికి వివాహం ఏర్పడ్డది. ప్రపంచంలో ఏముంది? కుటుంబంలో ఉన్న వాళ్లను ఎట్లా సంతోషపరచటం తన స్వార్థపూర్తి ఎట్లా సాధించటం మొదలగు అనేక ప్రశ్నలు వివాహంలో సంశ్లిష్టములై ఉన్నాయి.
స్వార్థ శబ్దం విని గాబరాపడనక్కర లేదు. సరిగా ఆలోచిస్తే పరమార్థం, అనేది ఒక పెద్ద స్వార్థం. కనుక నేను చెప్పేది ఏమిటంటే శబ్దములను చూచి భయపడనక్కర లేదు. అర్థాన్ని చూడు, వాస్తవాన్ని గుర్తించు.

నువ్వేమైనా చెయ్యి. ప్రతిదానికి నా ఆశీర్బలముండితీరుతుంది. నేను నీ క్షేమాన్ని సర్వకాలాలు కోరుతూ వుంటాను. నీ పెండ్లి ఎప్పుడో వ్రాయవలసింది. గరిమ పెండ్లికి తప్పక వస్తావుకదూ? నేనెంతవరకు పెండ్లి చేసుకుండా ఆపను? ఈసంవత్సరం చేసి తీరుతాను. గరిమ, విపిన్, నీకు నమస్కారాలు చెప్పారు.

" నా ఉపదేశానికి కోపగించకు. నీకు కనువిప్పు కాగలదనుకుంటాను. నిర్మొహమాటంగా కొన్నిమాటలు నీకు చెప్పవలసిన అవసరముందని భావించాను.

అందుకే వ్రాసాను—

నీ - భగవద్దయాళు. "

బిహారీకి ఈదిగువరీతిగా వ్రాయబడింది.

" బిహారీ, నీఉత్తరంతోపాటు సత్య ఉత్తరం కూడా ఒకటివచ్చింది. నీవు వ్రాశావు. ఆతను దారిలోకి వచ్చాడని. కాని మళ్ళీ తటపటాయిస్తున్నాడతను కాని నేను స్పష్టంగా చూస్తున్నాను. అతను దారికి రాక తప్పదు. నీవు అతనితో ఏమీ చెప్పకు. ఒకసారి ఆశాతంతువు తెగగానే అతడు నిస్సహాయుడైపోతాడు. అప్పుడు నాదగ్గిరకు పరుగెత్తుకునివస్తాడు. రాకపోతాడు - అదీమంచిదే. కఠినప్రపంచాన్ని నగ్నంగా ఎదుర్కొంటాడు. అప్పుడు నేనుచెప్పేదంతా, తానే ప్రపంచాన్నుండి మొట్టికాయలుతిని నేర్చుకుంటాడు. బిహారీ, అతడు నీమోస్తరువాడుకాదు. నావలె సభ్యత కొరకు డబ్బుకొరకు పెనగులాడకపోతే కష్టాలపాలవుతాడు. కుటీరంలోవుండి జీవితరసాన్ని పిండేనేర్పు అతనికి లేదు.

" నువ్వతనికి నాకిక్క చెప్పకు. వచ్చవేయుము. ఈ సంబంధము తప్పిపోతే సత్యానుచూచే, నాకిదుఃఖం - గరిమనుచూచిరాదు.

" ఇక్కడంతా క్షేమం.

నీ— బాబు. "

# ౨౫

సత్యాకు ఉత్తరంలోని ప్రత్యక్షరము మన్నింప తగిందిగా వుంది. కట్టోను తాను ప్రేమిస్తున్నాడు. అది ఇప్పుడు తాను వప్పుకుంటాడు. ఈ ప్రేమమూలమునే తాను ఆమెను రక్షించాలనుకుంటున్నాడు. తనదానినిగా చేసుకోవాలనుకుంటున్నాడు. 'తనది' అనేకోరిక వున్న ప్రేమ వాంఛనీయంకాదు. సత్యాకు ఆ విషయమై సందేహం లేదు.

మరి రెండోవిషయం. జీవితాన్ని సంతోషపరచటానికి ప్రేమ ఉపయోగపడవచ్చు. కాని ప్రేమకోసం జీవితాన్ని స్వాహాచేయలేము. జీవితం బాధ్యతాపూర్ణమైంది. వివాహం, అట్టిబాధ్యతలను నెరవేర్చటానికి వేసినబాట. బాధ్యతాపూర్ణమైన వివాహంలో ప్రేమకు ఏపాటిచోటు? జీవితం ప్రేమకంటె, ఎక్కువ మహాత్మ్యపూర్ణమైన పవిత్రమైనవస్తువు. ప్రేమ - కేవలం ఒక పొంగు, ఒకభావము - దీనికొరకు జీవితాన్ని త్యాగం ఎట్లాచేయటం? బాబు వ్రాసిన ఈ విషయం సత్యామనః ఫలకంమీద అచ్చుగ్రుద్దినట్లైంది. అతను ప్రాకులాడుతున్న జీవితసిద్ధాంతం అతనికి దొరికినట్లైంది. అతనికి ప్పుడు స్పష్టంగా కనబడుతోంది - తానుపట్టుకొన్న వ్రేలాడుతున్న విషయాలు కేవలం మాటలు - పచ్చి భావాలు. వాటిమీద ప్రపంచం ఎప్పుడూ నిలబడదు. బాబు వ్రాసాడు "జీవితం ఒక బాధ్యత" - ఎంతచక్కని మాట - ఎంతచక్కగాఅన్నాడు. ఈ బాధ్యత ఎవరివైపు - ప్రపం

చంవైపు - ప్రపంచోన్నతివైపు. బిహారి అయితే అనే వాడు "తనవైపు, తనఅంతఃకరణవైపు" అని. వినోద శీలుడైన బిహారీకి, విచారశీలుడైన సత్యకు ఇదే భేదము.

సత్యకు ఉత్తరంలోని తరువాత పేరాగ్రాపు బాగుంది. మొదటి పేరా గడబిడగావుంది. అది తన అహంభావాన్ని చూర్ణంచేస్తోంది. కాని ఆలోచిస్తే నిజమే. గరిమకు ఎప్పుడుకోరితే అప్పుడు, మంచివరుడు దొరకుతాడు. అంతకుతప్ప బాబుకు కావాలిసిందీ లేదు. కాని తనకు ముందుదారి అంతా అగమ్యమే, అయో మయమే.

కాని అప్పుడే పూర్తి నిరాశ చెందవలసిన పని లేదు.

అతను గదిలోకివచ్చాడు. బిహారీ అక్కడనే కూచుని వున్నాడు. బాబుజీ ఉత్తరంజూచి, సత్యవైపు అతనికాదరము హెచ్చింది. బిహారి గ్రహించాడు-సత్య తనలోతాను గుబ్బిసలాడుతున్నాడు అని.

తనలోతాను, సందిగ్ధంగా వుండిపోవడంకూడా జీవితంలో అమూల్యమైన విషయమే!

కాని బిహారీకి తెలియదు-సత్యతనఓటమినిఅంగీక రించటంలేదు. అతడు ఈ యుద్ధాన్ని వృధాఅని నిర్ణ యించుకుని ఓటమినిస్వీకరిస్తున్నాడు. అంతేకాని దాని మహాత్మ్యాన్ని గుర్తించలేదు, బిహారీ అన్నాడు — సత్య, రా! నాధన్యవాదాలు అందుకో.

"ధన్యవాదాలు దేనికి?"

"వాళ్లతో చెప్పినతరువాత కూడా కట్టో విష యమై నీవుపూర్తిగా ఉపేక్షవహించలేదని తెలిసింది."

" అవును. బాబుకు ఆ దేశోరణిలో వ్రాసాను. కాని ..."

" కాని ?"

" కాని జీవితం బాధ్యతతోకూడిన విషయం "

" అయితే "

" ప్రేమ ఒక తాత్కాలిక భావన. జీవన స్థాయిత్వానికి అస్థాయిభావాలు తోడ్పడలేవు. "

" బిహారికికూడా తెలిసేటట్లు చెప్పు. అంత కష్టమైన భాష అర్థంచేసుకోలేను. జీవితంయొక్క స్థాయిత్వంఅంటే ఎటువంటిది ? జీవితం శాశ్వతమైందా ? అంటే ప్రపంచంలో గడిచే యీ యాభై అరవై లేదా వందసంవత్సరాలు ? స్థాయిత్వంఅనే పరిభాషకు హద్దు వందసంవత్సరాలేనా ?"

" పొరపాటుపడకు. జీవితం శాశ్వతమైంది. ఒకవైపు అది సాగిపోతూవుండాలి. అదే దానిస్థాయిత్వం "

" ... మరి ఇదే తమరిపాండిత్యం !"

" బిహారీ! నువ్వు అర్థంచేసుకోలేకుండవున్నావు. అందుకు నాదేమి తప్పు ? బాగావిచారిస్తే కట్టావైపు ప్రేమఅనే ఒకభావంచేత లాగబడుతూవున్నాను ప్రేమ అనేది ఒకభావం. భావం పుట్టుతూవుంటుంది. చస్తూవుంటుంది అంటే అది క్షణస్థాయి. మరి వివాహము నేది ఒకసత్యం. బాధ్యతాపూర్ణమైంది. ప్రేమకు అందులో స్థానంఇవ్వడం మంచిదికాదు."

" ప్రతివిషయంలో అతి తెలివికి స్థానం ఇవ్వడం కూడా మంచిదికాదు. ... అయితే ఇన్నిరోజులకుగా

తమరీ సత్యాన్ని గుర్తించారన్నమాట. ఈలోపల కట్టా ఏంచేస్తూవుందో తమకు తెలుసునా? ఆమె తమరిని ధ్యానంచేస్తూవుంది. మనస్సులో పరమాత్మ స్వరూపాన్ని తమకిస్తోంది. "కాని నేనేమి చెయ్యను? ప్రేమలో అధికారవాంఛ ఉన్నచోట మాలిన్యండుంది. ఆ మాలిన్యానికి పెత్తనం ఇవ్వమంటావా?"

"అట్లావద్దండి. విశుద్ధమైన పరిశుద్ధతను స్వీకరించండి. ఆ విశుద్ధతేమిటో కాస్త చెప్పదూ" "ఏ విషయ మీద ప్రపంచం సుస్థిరమైవుందో ఏ చక్రాన్ని నువ్వూనేనూ మార్చలేమో అటువంటిదాన్ని పెకలించటానికి మారుగా బలపర్చటానికి ప్రయత్నంచేస్తే చాలా బాగుంటుంది. మరి ప్రపంచానికి ఆధారభూతమైన ఆతత్వం ఏమిటంటే – ఎవడూ ప్రపంచంలో కేవల స్వతంత్రుడు లేడు, అందరూ బాధ్యతలతో బంధింపబడ్డవాళ్ళే; వాటిల్లోనే వారి కృతార్థత, ముక్తి యిమిడిఉన్నాయి."

"చాలాబాగుంది. తమజీవితంలో ఒకబాధ్యత – గరిమను పెండ్లాడటం– చాలాబాగుంది– తరువాత, తరువాత?"

"బిహారీనువ్వు ప్రపంచాన్ని నవ్వటంమాత్రమే నేర్చుకున్నావు. దానిలో వచ్చేదేమీలేదు దాన్నిఅర్థం చేసుకోటంలో వుంది కష్టం"

"ఓహోహో! తమరొక్కక్షణంలో ప్రపంచరహస్యాన్ని గుర్తించివేసారే. అటువంటి ప్రపంచానికి ఓ కేబక్క దణ్ణం. నా నవ్వును పరమాత్మరక్షించుగాక"

"బిహారీ! నువ్విప్పుడే గ్రహించలేవు. ఆ విష యంపోనీ"

"నిజం ... తమరు గ్రహించివేసారు. అంతటి విశాలమైన గహనతత్త్వం బిహారీ నవ్వు మెదడులో ఇముడదు. కాని చెప్పండి. అదృష్టమనండి దురదృష్ట మనండి- నేను బాధ్యతా పరిణీతమైన గరిమ అన్నను. తమనిర్ణయాన్ని విని ఇంటికి చేరెయ్యాలికదా?"

బిహారీ! బాబూజీకి, అమ్మకు ఇష్టమైనదాన్ని నీకూ గరిమకూకూడా అంగీకారమైనదానికి- నేను కాద నను. పెద్దలమాట వింటాను. వాళ్ల ఆశీర్వాదబలాన్ని పోగొట్టుకోలేను."

"శుభమస్తు! ...... కాని బిహారీ, శ్రీసత్య ధర్ గారికి ఒక సూచనచేయవలసిఉంది – కట్టో వారిని కలుసుకోగోరుతోంది"

కట్టో రావటం. బిహారీ కిటికిలోనుంచి చూశాడు.

"మరిఒక విన్నపము" బిహారీ చెప్తున్నాడు "కట్టోకు సంస్కృతపాండిత్యం అగాధంగాలేదు. ప్రపం చంయొక్క తత్త్వాన్ని చదువుకొన్నదికాదు. అందుకని ఆమె ముందర సత్యధర్ గారు సంస్కృత వేదాంతం చెప్పకుండావుంటే మంచిది. అట్లాకాకపోతే అర్థంకాక, అదే కారణంగా సత్యధర్ గారిని పరమాత్మ అని భ్రమ పడవచ్చు. కట్టోయొక్క క్షేమం ఏకాంతం విచారించినా నామనవిని అంగీకరిస్తారని ఆశిస్తున్నాను."

కట్టో దర్వాజాలోకి వచ్చింది.

## ౨౬

కట్టో వచ్చింది — బిహారీ వెళ్లిపోవటం ప్రారంభించాడు.

"వద్దు వెళ్ల వద్దు." అని కట్టో సత్యాకు ఒకగజం దూరంలో నిలబడింది. సత్యామీద ఆమె దృక్కులు వ్రాలుతూఉన్నాయి. వాటిల్లో ఎటువంటిభావం ఉన్నది? కేవలం ఒక అకించన స్త్రీ, పదధూళిని యాచించటానికి వచ్చినట్లుగాఉంది — అంతే.

"నువ్వు ఇతని పరిచయం ఎందుకు కలిగించలేదు?"

కట్టో సత్యాను అడిగింది.

"చెప్పితే ..."

కట్టో ఒక కొంటెనవ్వునవ్వి

"ఏంపనిమీద వచ్చింది ... అది"

సత్యాకు వేదాంతబలం కావాలి. లేకపోతే అతను మెల్లిగా జారిపోతున్నాడు. అదంతా కొంత ఊతం తెచ్చుకుని.

"బిహారీ స్వయంగా చెప్తానన్నాడు."

మాష్టరు యొక్క ద్రఢిమ కట్టోకునచ్చింది. "అందుకని అతనే వచ్చిచెప్పాడు."

అందరూ నిశ్శబ్దం.

మరికొంత సేపటికి కట్టో అంది.

"మా జీజీని (గరిమ) ఎప్పుడు తీసుకొస్తావు? ఈ ప్రశ్న ఆకస్మికము. వేదాంత పరిభాషవున్న

సత్య తన్నుతాను మఱచిఉన్నాడు. నిశ్శబ్దం. ఏమీ జవాబు ఇవ్వలేకపోయాడు.

"చెప్పు ఎప్పుడునవ్వుంది మాజీజీ"

మెల్లిగా అతనికి ధైర్యంవచ్చింది. ఇచ్ఛాశక్తిని బలపఱచి, ఒక నవ్వు నవ్వి "అయితే జీజీని తీసుకరావటం నీకిష్టమేనన్నమాట?" అన్నాడు.

"ఎందుకుకాదు! నీకేది యిష్టమో నాకదే యిష్టం భగవంతునిసాక్షి"

ఈ అమాయికపు ప్రతిపక్షియొక్క సత్యయొక్క సుసజ్జిత వాక్సైన్యం పనిచెయ్యటం. సత్యకు ఏంచెప్పాలిసింది తోచిందికాదు. తాను నిలుచున్న భూమి కదలిపోయినట్టుగావుంది అతనికి. "ఈ బిహారి, నీకునాతో అవసరంవచ్చిందని చెప్పాడు. నాతో అవసరం ఏమిటా అనుకున్నాను – వచ్చాను – సముఖంలో నుంచున్నాను. నేను నీదాసినే. నాతో మాటాడటానికి, నన్ను అడగటానికి భయపడుతున్నావు – నేను పరాయిదానికాదుల్లే."

బిహారీ "వెళ్ళు కట్టో. మాష్టరుగారు ఆశ్చర్యంగా నీమాటలన్నీ వింటున్నారు. ఆయన నాలుక మడతపడింది. భయంచేత అది కదలగంలేదు."

"నీవు కోరేది ప్రతిది, కట్టోకు అభిమతంగానే వుంటుంది. ఈమాటనమ్ము. నీ సంతోషమే కట్టోసంతోషము. నువ్వువిచారిస్తే దానికి ప్రాణాంతకంగా వుంటుంది. నీపనులలో కట్టోను లెక్కచెయ్యకు. నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. నువ్వు పెళ్లిచేసుకోవాలంటే అందరి

" ప్రయత్నిస్తాను. కాని బహుశః దేవి పలుక వచ్చు. అప్పుడు మనకేమీ అర్థంకాదు. కాని నువ్వు గాబరాపడనద్దు. ఎందుకంటే, సామాన్యంగా అవి ఎవరి అర్థంకావు."

బిహారీ సత్య చెవుల్లో గుసగుసలాడాడు. " గడబిడచేస్తే గరిమ వెళ్లిపోతుంది. కట్లో నెత్తికెక్కుతుంది. జాగ్రత్త"

సత్య ఒక్కసారిగా విరుచుకపడ్డాడు " బిహారీ! నువ్విక్కడనుంచి వెళ్లిపో."

బిహారీ లాభనాటిగా కట్లోకు చెప్పాడు " భూతం పారిపోయింది. కాని నేనూ వెళ్లాలిసివస్తోంది!

ఇదేం న్యాయం!"

" బిహారీని ఉండనివ్వూ" కట్లో నిర్ధారణచేసి చెప్పింది " ఆతన్నెందుకు పంపించివేయటం?"

సత్య తిరిగి నిశ్శబ్దం.

కట్లో " చెప్పు. చెప్పవూ?"

మౌనం

" మాటాడకపోతే నేను వెళ్తున్నాను."

" ___ "

" వెళ్లనా?"

" వెళ్లు"

" ఒక్కమాట చెప్తున్నాను. ఒక్కటే ఒక్కటి. దాన్ని ఒప్పుకొని తీరాలి. సరేనా?"

" చెప్పు."

ప్రకాశిస్తాయి. "బిహారీ బాబూ! ఇంటిదాకా వస్తావా? — పసి వృద్ధి!"

బిహారీకి విదపుచి మేల్కొన్నట్లైంది. అతడు కట్టోను మెల్లిగా అనుసరించాడు.

## ౨౩

అదే గది. అదే అలమారా అదే కట్టో. అయినా అవేకావు. ఆ రాత్రిలో అయినంటి పాటే పాడుతున్నాయి. కాని ఏవేవో ఊహలు. విషాక్తములు అయినాయి. ఈ గది, ప్రకృతి ఎదుట ఉన్న అలమారా, దానిలో వస్తువు, బొమ్మల పెట్టె — అన్ని ఆమెను ఉసికొలుపుతూ నవ్వుతున్నాయి. "మేము నీకు సంబంధించిన వాళ్ళము కాము." అంటున్నాయి. స్మృతులు పొంగి పొంగి వస్తున్నాయి. నీవు స్వప్న కాలంలో మాతో ఆడుకున్నావు. ఇప్పుడు నీవు మేల్కొన్నావు. ఇక మేము వెళ్ళిపోతున్నాము అంటున్నాయి. 'ఎక్కడికో! ఇంకెక్కడికో' ఒక్క క్షణందాకా సత్యమైనవి ఎక్కడికో ఇంకెక్కడికో!' వెళ్ళిపోతున్నాయి.

ఏదో కొత్తదనం అనుభవిస్తూ బిహారీ అక్కడనే నిలబడి పోయాడు.

కట్టో బిహారీని విస్మయ భావంతో చూసింది. ఆమె దృక్కులడుగుతున్నాయి "నువ్వెవరు? ఎందుకు వచ్చావు? — ఏం కావాలి?"

బిహారీ నిస్సంకోచంగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని అన్నాడు "నేను గరిమ అన్నను, తెలిసిందా

ఎవరినో ? ఇప్పుడు 'కట్టో' అని తప్పు అనను." "నేనైనాను బిహారీబాబు. నువ్వు అతని స్నేహితుడవు. అందుచేత నాకు సర్వస్వానివి" బిహారి ఒకింత జిజ్ఞాసతో, చాలా ఆశంకతో, ఆకాంక్షతో అడిగాడు "కట్టో! ఇప్పుడేమిటి..." "మొదట ఒక్కడను. ఇప్పుడిద్దరం. ఇరువురి సేవ చేస్తూవుంటాను. ఇప్పుడు నా పని ఎక్కువైంది."

సత్య నీ సేవకు తగడని బిహారీ చెప్పదలచుకున్నాడు. కాని సమక్షంలో భక్తురాలి ఇష్టమూర్తిని కాదనలేకపోయాడు. కట్టో మర్యాదచూసి అతను సత్యానిప్పుడేమీ అనలేదు.

"సత్యకు నీ సేవ అవసరము లేదు. నీ జీజీ ఒప్పుకోదు."

"పోనీ! నా పని నా పనే. శరీరంతో కాకపోతే మనస్సుతోనే చేస్తాను."

అదే క్షణంలో అంతరిక్షంగా ఒక భావం లేచి బిహారీశరీరాన్ని ఆత్మను ఒకేరంగులో ముంచివేసింది. పరమాత్మ మనఇరువురిని ఒకచోట కూర్చాడు — ఇప్పుడు రెండుధారలు ఏకమై ప్రవహించాలి, వాటికి మరోపనిలేదు సంయుక్త జీవనధారమీద అడుగడుగున తీర్థస్థలాలు స్థాపించాలి. పుణ్యగంగవలె యీ ధార ప్రవహించాలి— కల్యాణం కురిపిస్తూ, భూములను పచ్చపచ్చజేస్తూ జనులను సుస్నాతంచేస్తూ, తరంగితమై అనంతసాగరంలో విలీనంకావాలి. బిహారీ ఒక క్షణంపాటు ఈలోకోత్తర భావంలో తన్మయుడయ్యాడు. తిరిగి అన్నాడు.

"కట్టో! సాక్షాత్కారమేది"

కంఠం గాద్గద్యమును వహించింది. స్వరంగీచు కొనిపోయింది.

"బిహారీబాబు!"

ఆమె కుండా అంతేఅని ఆగిపోయింది.....మళ్ళీ "నేనునిన్ను అపార్థంచేసుకుంటున్నానని అనుకోకు. నీలా అర్థంచేసుకోవాలసిందే లేదు. పైటవెట్లాగో లోపలా అట్లాగే. లోపలకూడ అదే వినోద స్రోతస్సు ప్రవహిస్తూవుంది- సగంనీరు అశ్రువులది సగంనవ్వుది. ఆస్రోతస్సునుంచి ప్రతివిషయం ప్రతిబింబిస్తూ వుంటుంది. కానున్నదికాక మానదు - లేనిది కానూ కాదు. అయిందేమిటో అయింది. దానినిగూర్చి ఇప్పుడేమనుకున్నా లాభంలేదు. అతడిప్పుడు నావాడు గాడు ... కాని,

"కాని" వ్యగ్ర ఉత్కంఠతో బిహారీ ప్రతిధ్వనించాడు.

"కాని ఒకమాటవుంది. నిద్రపోతూవుంటే ఆకాశగంగను పైన కిలకిలలాడుతూ వుండటంచూస్తున్నాను. అది క్రిందనున్న మనల్ని చూస్తూనేవుంటుంది. ప్రపంచగంగకూడా పైకి చూస్తూ నవ్వుతూ ప్రవహిస్తూ వుంటుంది. నాకు ఇవిరెండు ఒకదాన్ని ఒకటే చూసుకుంటూ బ్రతుకుతున్నట్లు అనిపిస్తుంది. వ్యాప్తమైవున్న అనంతశూన్యం పరస్పర క్షేమాన్ని నవ్వుద్వారా ఆకాశాన్ని ఛేదించి వ్యక్తం చేస్తూవుంటుంది - రెండింటి మనస్సు ఒకటి. నియమం ఒకటి. రెండు అనుకుని దూరంగావుండి రెండుభిన్న ప్రదేశాలలో తమకర్తవ్యాన్ని నెరవేరుస్తున్నాయనిపిస్తుంది. చూడటానికి

దూరంగావున్నాయి. కాని దగ్గిరే. వేరుగావున్నాయి కాని ఒకటే! బిహారీబాబూ, బిహారీబాబూ!... ఇది అసంభవమా? అట్లాగే మనమిద్దరమూ ఉండకూడదా! దూరంగా అయినా దగ్గిరే — వేరుగా అయినప్పటికీ అభిన్నంగా— రెండుగా అయినప్పటికీ ఒకటిగా ఒకే ఉద్దేశ్యం ఒకే జీవనలక్ష్యంతో గ్రథింపబడి—? బిహారీ అన్నాడు "కట్యా!"

కట్యా — "రా, నాతో గ్రథింపబడుతావా? నన్ను నువ్వు చూశావు నేను నిన్ను చూశాను. నీవు నా భాష చూశావు. భావాలు ఇద్దరికే తెలుసు. నేను ఎంత చదువుకున్నదీ అతనెరుగడు, ఎవరూ ఎరుగరు, నేనూ ఎరుగను నువ్వెప్పుడు తెలుసుకున్నావో, అప్పుడే నేను తెలుసుకున్నాను. ఇంత భాష వచ్చినప్పటికీ, నీకు సాయపడకపోను. అమ్మపోయిన తరువాత, నా భావ రొట్టెపిన్నాకపోదు. ఈ విధంగా చదువుబట్టిచూసినా నా నుంచి నువ్వు సిగ్గుపడవలసి అవసరము లేదు. చెప్పు... నాతో పాటు ఏకసూత్రంలో గ్రుచ్చబడుతావా?"

"చదువును వరదలో పారెయ్యి ... గ్రథింపబడతాను."

"బిహారీబాబు, కఠినయజ్ఞం చేయటానికి మనమిద్దరము ఒకచోట చేరాము. ఆలోచించుకో. ముందు జీవయాత్ర సుదూరంగావుంది."

"నువ్వు నాకంటె చిన్నదానివి నీకు మరింత కష్టము"

"నాకు తప్పనే తప్పదు... మరి నీవిషయం"

కట్టా నేనూ నీకోసం ఆశే."

ఆ యజ్ఞానికి అన్నిటి కంటె సుందరమైన పేరు వైధవ్యం' అంటే 'ఆత్మ - ఆహుతి' — ఇష్టమేనా?"

"ఇష్టమే"

కట్టా ఎడమ చెయ్యి ముందుకు వెళ్ళింది. బిహారీ కుడిచెయ్యి దానిని గ్రహించింది. రెండు ఒకటై నిలబడ్డాయి.

"మన మిరువురమూ. వైధవ్య యజ్ఞాన్ని స్వీకరించి ఆజన్మం బంధింప బడుతున్నాము.

మన మిరువురమూ ఒకటే — ఒకే ప్రాణము రెండు శరీరాలు. ఎన్నడూ మనలను వేరుపరచలేరు." అని కట్టా అంది.

"మన మిరువురమూ. వైధవ్య యజ్ఞాన్ని స్వీకరించి ఆజన్మం బంధింప బడుతున్నాము. మన మిరువురమూ ఒకటే — ఒకే ప్రాణము, రెండు శరీరాలు. ఎన్నడూ మనలను వేరుపరచలేరు." అని బిహారీ తిరిగి ప్రతిధ్వనించాడు.

"నేడు నా పెండ్లి...నా వైధవ్యం సార్థకమైంది" అని కట్టా.

బిహారీ "ఈ మహాశూన్యమే సాక్షి. మనము కట్టా బిహారీలము పరస్పరం కట్టా బిహారీలుగానే ఉండిపోతాము. ఇందుకు కించిత్తు ఎక్కువలేదు, కించిత్తు తక్కువ లేదు."

తిరిగి బిహారీఅన్నాడు "ఏమిఇస్తే అది తీసుకుంటాను, జను."

"ఏమిఇస్తే అది తీసుకుంటాను."

కొంచెంసేపు ఇద్దర్నూ మౌన వహించారు. కట్ట్లో కొంచెం నవ్వింది "ముసలితల్లి, వకాంతాసుంచి సునాయాసంగా ఉద్దరి పబట్టాయి. రా. నాకు ఒకసహి చేసిపెట్టు. నువ్వు ఇంటికి ఎప్పుడు వెళ్తున్నావు?"

"నేటిరాత్రి. లేకపోతే రేపుఉదయం తప్పకుండా."

బొట్టుపెట్టి దుస్తులు, అద్దం, ఎర్రగాజులు తీసి మూటకట్టి కట్టూ అది నీ చెల్లెలు- ఏమిటిపేరు? కరీమా - ఆమేగా నా జీజీ! ఆమెకు ఇవ్వాలనుకొని వెళ్ళి ఇవ్వవలసింది- చెప్పు - ఒక తులసిమొక్క, పల్లెటూరిది - కట్టూ అనేది ఇచ్చిందని. అతను ప్రత్యేకంగా మా ఇంట్లో భోజనం చెయ్యటానికి మాటయిచ్చాడనికూడా చెప్పు. కట్టూ ఇంగ్లీషు నేర్వాలనికూడా చెప్పు. కట్టూను ఆశీర్వదించమనికూడా చెప్పు. నేను యెట్లాగో లభించవచెయ్యాలి ముందుగానే ఆశీస్సులు పంపమని చెప్పు. ఇదంతా చెప్తావుకదూ? చెప్పు తప్పకుండా!"

"తప్పకుండా చెప్తాను. ఈ నీ సౌభాగ్యం కట్టూ ఇచ్చిందని చెప్తాను."

"ఆఁఆ! ఏమిటి అంటావు. ఇవి నేను బలవంతంగా కోరుకున్నది. నాదగ్గిఉన్న శ్రేష్ఠమైన శుభవస్తువును ఇస్తున్నాను. అని చెప్పు."

"అంతా చెప్తాను. మరిచెప్తాను. కట్టూ నన్ను వరించిందని"

"చెప్పు"

"నాసని అయిందా ?"

"ఆ !"

"వెళ్ళనా ?"

"వెళ్ళు తల్లిపాదాలకు నమస్కరిస్తూ వెళ్ళు"

"వెళ్ళేముందు ఏమీనా ఇవ్వనా?-బలే వరించటం!"

"ఏమివ్వచ్చు !"

"ఏదో ఒకటి"

"మంచిది తీసుకో"

అన్నిన్ని ఒక కుర్చీలో కూర్చోబెట్టి చర్ఖామీద దారం తీసింది. పసుపురంగులో దాన్ని తడిపి మాలగా చేసింది. రెండు చేతులతో వరిమాలగా పట్టుకొని, మధువేదనా భారమైన నవ్వునవ్వి, మెడలో వేసింది. ఒక నమస్కారం చేసింది, కాళ్ళను చేతుల్తో తాకింది. అతని చేతిని తనమస్తకాన్ని స్పృశింపచేసింది.

ఈ కోలాహలంలో ఆగది, పరదృశ్యాలను పడనీలేదు. ఈ గ్రంధి బంధన మహోత్సవానికి, ఏకమాత్ర సాక్షియై, ప్రకృతి తనలో తాను మౌనంగా వుండిపోయింది.

"మాల సత్యకు చూపిస్తాను." బిహారీమంత్రముగ్ధతనుంచి తప్పించుకొని అన్నాడు.

"నీది-నీయిష్టం ఏమైనా చెయ్యి."

"వెళ్తున్నాను. ఎప్పుడు తిరిగి కలుసుకోటం"

"చూడు -"

"కట్టో నమస్కారము. బిహారీ నమస్కారం చేస్తున్నాడు. దాంతోపాటు ఇది తీసుకో" బాగా నలి

గిన కాగితప్పు మడత బిహారీ తీసియిచ్చాడు. అతనక్కడ నిలుచుండలేదు? కట్టో తల్లికి నమస్కరించి చక్కా వెళ్లాడు.

వందరూపాయలనోట్లు చూసి కట్టో ఒక క్షణం సంభ్రాంతి చెందింది. తిరిగి వంటింటిలోకి తన పనిమీద పోయింది.

## ౨౮

బిహారీ తన ఇంటికే చేరాడు. బాబు వరండాలోనే కూచుని వున్నాడు. బండిలోనుంచి దిగలేదు. అడిగాడు "వచ్చేసారా?" "ఏం తెచ్చారు?" "ఆ! వచ్చేసాను."

"ఏమిటి సంగతి"

"ఇప్పుడే వస్తున్నాను. కొంచెం ఈ సామాను ... పైన"

"ఆఁ ఆ!"

బాబు నౌకరు సామాను తెస్తూవుండటం చూసాడు. ఎంతసేపు చెప్పాలి మాట — కాని అట్లాగే చెడు లక్షణాలు కనబడటంలేదు.

బాబుకు సంగతి చెప్పాలి. కాని అంతకన్న తొందరగా కట్టో పని చెయ్యాలి. అన్నిటికంటె ముందు కట్టో — తరువాత ఏదైనా! చిన్నగొల్లముతో మేడపైకి చేరాడు. పిలిచాడు "గిరీ! గిరీ!"

గిరి పాటింట్లో వ్రాడి జుత్తు ఆరపోసికొని అవ్వ ఏం చేస్తున్నదో అని వంటింట్లోకి వెళ్లింది. ఎంత చెప్పినా అవ్వ ఏదో ఒకటి చేస్తునే వుంటుంది. గరిమను వంటవ్వ ఎరిగదా ఏమిటి? సరిగా చేయకపోతే ఢిల్లీలో వంటల క్లాసులు కడితేనేమిటి? అదిమిడయనే అవ్వకు పన్నెండో సారి చెప్పటానికి వెళ్లింది. గరిమను జూడగానే అవ్వ వణికి పోతుంది. వణకటంలో ఉప్పు పరమాన్నంలో పడినా ఆశ్చర్యపడ నక్కర లేదు. ఆ పరమాన్నం తిన వలసినప్పుడు అందరి తరపున ప్రతినిధిగా నిలచి, మహా రౌద్రిణిలా ప్రత్యక్షిస్తూ గరిమ వంటవ్వ మీద విరుచుకుని పడుతుంది. ఈ కేకలలో మిరపకాయలు పొయ్యిలో పడతాయి. ఇక తుమ్ములు! సగం కోపం అట్లా వుండగానే గరిమ తుమ్ముకుంటూ తిట్టుకుంటూ పరుగెత్తి పోతుంది. అటువంటి ఘటనే ఇప్పుడుకూడా జరిగింది. మిరపకాయలు నిప్పులో ఆహుతి అయినాయి. బయటకు పరుగెత్తి గరిమ.

"నేను ... ఆఛ్ఛీ, ఛీం – అన్న ... ఆచ్ఛీ"

బిహారీ తను రావటంతోటే ఈ తుమ్ముల పరంపర విన్నాడు.

"ఏమిటి సంగతి ?"

"అ పాపిష్టిదాన్ని – అక్ ఛి డామ్, ఛి"

"నేను రాగానే ఇట్లా"

"డామ్ రా స్కేల్ ... ఆచ్ఛీ"

"నన్ను క్షమించు. నేను వెళ్లిపోతున్నాను."

"నై ఠాక్ – రేపటినుంచి ... ఆచ్ఛీ"

తుమ్ములు కొంచెం తగ్గినతరువాత బిహారీ అన్నాడు "గిరీ!"

"ఆ వంటవ్వాగేపట్టించి ఉండటానికి వీల్లేదు. నేను చెప్తున్నాను."

"నామాటవింటున్నావా లేక"

"వింటున్నాను. కాని నువ్వే"

"అవును. నేనే రచించాను, నేనే పాడు చేసాను."

"నువ్వే వంటవ్వాను ఏర్పాటుచేసావు."

"ఇహా అట్లాచెప్పకు మరి! ... ఇప్పుడు స్వస్థ పడ్డావా!"

"స్వస్థ పడటంకాదు. ఏదో హంగామా చేస్తూ నేవుంటుంది"

"సరే. ఈ అధ్యాయాన్ని పూర్తిచెయ్యి. ప్రకోప పర్వం సమాప్తం చెయ్యి. నవీన పర్వం ఆరంభం విను" "సరే చెప్పు" అన్నట్లుగా గిరి వినటానికి సిద్ధమై నిలుచుంది.

"నేనక్కడనుంచి వచ్చేసాను. నీకు ఒకపొట్లం తెచ్చాను. తీసుకో"

పొట్లంవిప్పి గిరిముందర పెట్టాను.

"ఎవరిచ్చారు ... ఆ?"

"ఆ అమ్మాయే ... కట్టోను ఎరుగుదువుగా?"

గిరి కట్టోను బాగాఎరుగు. నవ్వు స్వభావం ఆమె పూర్తిగా గుర్తిస్తూనే వచ్చింది. ఎరుగు -

మూలంలో కట్టాయే ఉంది. అది ఎరుగటంతోటే కట్టాను తన ప్రతిద్వంద్విగా భావించింది. బాబు, మరి యితరులు ఎంత చెప్పినా అతను వినటం లేదు — పోటీ బలవత్తరమైనదని ఆమె తెలుసుకున్నది. రాత్రి బళ్ళో “ఈ పల్లెటూరి పిల్లకూ నాకూ పోటీయా” అన్న భావం ఆమె మనస్సులో ప్రజ్వలిస్తూనేవుంది. ఈభావమే ఒకప్పుడు నటులమీదకు, ఒకప్పుడు బాబుమీదకు, మరొకప్పుడు తల్లిమీదకి కోపంగా మారుతూవుండేది. తను యింకా పైపెచ్చు చదువుకొన్నది. సత్యకూడా ఆకారంలో మరీ అంత తీసికట్టు కాదు. అందులో యౌవ్వనం ఎక్కువగా అందంగానే వుంటుంది. కాని కట్టా పేరు వినడంతోటే, ముఖ్యంగా డంపుచూడటంతోటే సత్య వైపు తనకున్న సామాన్య ఆకర్షణ కట్టాపైన, ప్రబలమైన ఈర్ష్యా భావంగా మారింది. అప్పుడు తాను సత్యను మరి ప్రేమించటం మొదలుపెట్టింది. అందుకే తాను బాధపడుతూ వచ్చింది.

ఇప్పుడు బిహారీ నిజమైన కబురు తెచ్చాడు. కట్టా కొన్ని వస్తువులుకూడా తెచ్చింది! వాటన్నిటినీ తన జయంలో సంపాదించిన వస్తువులుగా స్వీకరించింది. కట్టాను ఎట్లా జయించాను? నాతో పోటీకివచ్చింది ‘పిచ్చిది’ అన్న భావమే ఆమెకు అప్పటి సంభాషణకన్న ఎక్కువ సంతోషాన్ని ఇచ్చింది. సత్య తనకూ వివాహం అవుతుంది అన్న విషయమే తనకు తట్టలేదు. కట్టాను జయించాననే ఉన్నతభావమే ఆమెను పరవశంచేసింది.

“అయితే! ఆమే ఇచ్చిందా?”

" అవును. "

" ఎరుగదూ తసకుమల్లె పల్లెటూరి సరకు కాదని "

" ఆమెకు ఎదీ తెలియదు. "

" నాకు వీటితో ఏమిటి ఉపయోగం - అవతల పారవెయ్యటం ఒక్కటే "

" ఆ! ఆ! పార వేయనద్దు. నామీదఒట్టు. ఈ దువ్వెన, ఈ అద్దం. ఈ కుంకుమ తీసుకొని నేనేమి చెయ్యాలి ?"

" గిరీ! వీటిని పారెయ్యవద్దు. "

" ఇందులో రత్నాలన్నీ మించుకుపోతు న్నాయూ ? ఇవన్నీ కలిసి ఎన్నిదమ్మిడీలు ?"

" గిరీ! కట్టో నీతో చెప్పమని కొన్నిమాటలు కూడా చెప్పింది "

" ఏమి టేమిటి ? చెప్పు వింటాను "

" నువ్వు తన జీజీవి. నీ దగ్గిఆనుంచి ఇంగ్లీషు నేర్చుకుంటుంది. ప్రథమంగా నువ్వు వాళ్లింట్లో నే భోం చెయ్యాలి -కట్టో, ఈ విషయమై సత్యనుంచి వాగ్దానం పుచ్చుకుంది, మతరిన్ను ఆశీర్వదించమంది. "

ఈమాటలు గిరిమనస్సులో గుచ్చుకున్నాయి. కట్టో ఇట్లా చెప్పటంలోగల ఉద్దేశ్యమేమిటో తాను గ్రహించ లేక పోయింది. డోలాందోళన స్థితిలో పడింది. ఆమె మనసు, అన్నది.—"

"ఆమెకు మరేమీ చెప్పటానికి తోచలేదా !"

"గిరీ ! ఒక మాట చెప్పనా ? "

"కట్టాను గురించా ? ... చెప్పు"

తను కట్టాను క్రోధానికి గురిచేయతలచుకోలేదు. ఇప్పుడు తను దయతో చూసి స్నేహాన్ని సాధించుకోవాలి. — తన కెందుకు ఆమెతో ఎడమొగం, పెడ మొగం — ఇప్పుడు అనుగ్రహం చూపించాలి. అందుకే మళ్ళీ అంది "ఏమి చెప్పదలచుకొన్నావో చెప్పు లేకపోతే ఆమెను గురించి చెప్పు. నేనిప్పుడామెను ప్రేమిస్తాను."

"గిరీ! ఆమె అందమైనది కాదు. ఎక్కువగా చదువుకోలేదు. మేమిరువురమూ, పరస్పర బద్ధులమై పోయినాము. నేను పెళ్లి చేసుకున్నాను.

ఈ మాట గరిమకు ఆకస్మికమైంది. ఇది వింటానికి ఆమె తయారుగా లేదు. ఇంత అదృష్టానికి తగిందా కట్టా ? కట్టాను ప్రేమిస్తుంది — ప్రేమిస్తోంది. కాని యెకాయికీ ఇంత అదృష్టమా ? కట్టా తన యోగ్యత చేత సంపాదించింది కాదు ఇది. నిస్సందేహంగా మోసంతో సంపాదించింది. ఆమె అన్నది — "అన్నయ్యా! ఇదేమిటిట్లా అంటావు ? గారిడీ చేసింది. ఆమె చ్చులో పడి పోయావు."

"ఆ! అవును. గారిడీ చేసింది. ఆమె నిజంగా మాయ కిలాడి. నేనే ఆమె మాయనుండి సత్యను రక్షించాను రక్షించటంలో, స్వయం చిక్కు పడిపోయాను.

"ఇదేమి పిచ్చితనము ?" గరిమ అంది.

"పిచ్చి ఏమిటి ?" అంటూ బాబు ప్రవేశించాడు.

"బాబూ! బిహారీ పెళ్లి చేసుకున్నాడుఆ కట్లో"

బాబు ఉలిక్కి పడ్డాడు. "ఏమిటి ?"

"కట్లో అనే పిల్ల మీరు వినేవుందురు."

బాబు ముఖంనుండి "బిహారి ?" అనే ప్రశ్న వెలువడింది.

బిహారీ అవిచలితంగా, అఖండితంగా అన్నాడు.

"జీ!"

బాబు ఒక్క క్షణం మౌనంగా ఉన్నాడు. మ రేమి మారిపోయాడో! అన్నాడు "కోడలిని ఎప్పుడు తీసు కొస్తావు ?"

"బాబూ! ఆమె ఇంటికి రాదు. అక్కడే వుంటుంది"

"ఏమిటి ?" అని బాబు గద్దించాడు.

"ఆమె అక్కడనే ఉండాలనుకుంటోంది."

"మరినువ్వు."

"పరీక్షలైనతరువాత తిరగటానికి వెళ్తాను. తమరు విచారించకండి. ఈసారితప్పదు. దేశం తిరగ టంలో రెండుసంవత్సరాలు పట్టవచ్చు ఇంకా అంతకంటె ఎక్కువైనా కావచ్చు. తిరిగివచ్చి తమరితో సంప్రదించి ఏపనైనా చేస్తాను.

"మరి కోడలూ ? ... కాదు. నా కోడలు నా దగ్గిరేవుంటుంది. కోడలు అక్కడ దేనికి. ఈ డబ్బంతా ఏమికావాలి ... మురిగి పోతోంది. కోడలు ఇక్కడే వుంటుంది బిహారీ"

"కబురుపెట్టండి. వస్తేవస్తుంది."

"ఈ పెండ్లి ఎట్లా అయిందినీకు!"

"మేమింకా పెండ్లి చేసుకోము కనుక మా పెళ్లి అయింది. దగ్గిఱగా ఉండనీ. దూరంగా ఉండనీ, మేమిద్దఱమూ సన్నిహితులమే."

"ఈ పిచ్చిని దూరంగా కట్టిపెట్టు. వెళ్ళితే వెళ్లు. అంతేకాని ఈ పిచ్చిని నేను వినగోరటంలేదు. ప్రపంచానికి సంబంధించనిమాటలు నాముందర రా నీకు" బాబు ఇంటిసావడిలోకి వెళ్ళి బిహారీ తల్లినిపిలచి అన్నాడు "విన్నావా?– బిహారీ పెళ్ళిచేసుకున్నాడు. కోడలు అక్కడేవుంటుందట. బిహారీ తిరుగుతూ వుంటాడు – ఇటువంటిమాట ఎప్పుడైనా విన్నావా?" "పెండ్లి అయిందా?– ఎవరికీమాటమాత్రం తెలియదే. కోడలు అక్కడ – తాను ఇక్కడకాదు! అక్కడా కాదు! – ఇదేమిటి అట్లాచెప్తాడు!"

"అయితే బిహారీనే పిలిపించి అడుగు." అని బాబు వరండాలోకి వెళ్ళి పేపరుచూసుకుంటూ కూర్చున్నాడు! గరిమసంగతి అసలు మరచేపొయ్యాడు ఈ వేడిలో!

## ౨౯

పెండ్లిఅయిపోయింది- గొప్పయింటిపిల్ల! బాగా చదువుకున్నది – పల్లెటూరువచ్చింది – ప్రపంచంలో ఎనిమిదో ఆశ్చర్యకరమైన విషయం జరిగింది! కాని ఆగండి తొందరపడకండి నవవధువును చూడటానికి!

చుట్టూ ఉన్న స్త్రీజనాన్ని తోలుకుపోనీండి. కట్టోత్తో పాటు ఒంటరిగా వెళ్లిదాం!

కట్టోత్తో పునః పరిచయం చేసుకుందాం! చిన్నప్పటి కట్టో అయిపోయింది. తిరిగి అట్లాగే గంతులు, చిందులు వేస్తూ కట్టో అయిపోయింది!

జీజీ వచ్చి చాలాసేపు అయింది. కాని కలుసుకోటానికి తీరికే కలగలేదు. అందరితో పాటు వెళ్లితే తాను మొదలకుండా కూర్చోవాలి! అది తనకు చేతనైన పని కాదు. తాను జీజీతో మాటాడాలి కులాసాగా జుట్టుదువ్వాలి — జీజీ కున్న వస్తువులన్నీ చూడాలి. — పుస్తకాలు, నగలూ కూడ. కాని ఆడవాళ్లు ఎక్కడ దారికారు. ముసురుకొని కూర్చున్నారు — కదలనే కదలరు. కట్టో విళ్లహానికి లోలోపల కుమిలిపోయింది. కూర్చుంటే కూర్చోనీ — తాను వెళ్ళితీరాలి దగ్గఱకు

ప్రౌఢలు, నవీనలు ఉజ్జ్వల వర్ణాలు, శ్యామల గాత్రలు, మొదలైన భిన్న భిన్న రూపాలతో ఉన్న స్త్రీలు 'ఒక్కదాన్ని చేసి చుట్టూ మూగారు'

ఆ ఒక్కతె నవాగత వధువు గరిమ! ఓణీ వేసుకుని ఎట్లా కూచుంది! సిగ్గుమూట ఐనట్లు!

ఎప్పుడూ అట్లాగే కూచుంటున్నట్లు! నగలు ప్రత్యంగం మీద తళతళలు కురుస్తున్నాయి. దృష్టి అటుపోయి ఇటుపోయి చివరకు ఎడమ చేతి కంకణ పుటంచుల మీద వ్రాలుతున్నాయి. వధువు ఇంత మంది చూపుల్లో పడి అలసి పోయింది. ఆమె తన్ను పరివేష్టించి ఉన్న కొత్తపోవాలి. అందుకు ఏదనైనా

కొంత మాటాడాలి. కాని వీళ్ళందరూ పరస్పరం మాటాడరు - బహుశః ఇంగ్లీషు మాటాడుతుందనేమో ? - కేవలం చూస్తూ కూచున్నారు.

వధువు లేవలేదు. ఇక కూచోనూ లేదు. చాలా బాధగా వుంది ఆమెకు. ఎన్నోసార్లు అజ్ఞాతంగా చూస్తూ ఆమెదృష్టి కంకణంమీదకు వచ్చింది. ఇంతట్లో ---

" జీజీ!"

చూచింది. ఆమే. అనాయాసంగా అంది "కట్టూ" నిమిషంలోకి వికసించింది. చేతులు సారించింది. స్వాగతం చెప్పటానికి ఒక్కసారిగా కట్టూను కూర్చోపెట్ట డానికి హృదయకవాటాలు తెరచినట్లు, ఆమె లేచి నిలబడింది.

కట్టూ పరుగెత్తుకుని వచ్చి ఆ కణాలలో ఇమిడి పోయింది.

" జీజీ!"

" కట్టూ !"

రెండునదులు కలిసినట్లైంది. రెండుజ్యోతీ వెలుగు పెనవైచుకొన్నట్లు, రెండుకోమలత్వాములు సంగమించినట్లు అయింది.

తతిమ్మా స్త్రీలకు ఆశ్చర్యం - కట్టూ ఎప్పుడూ ఈఊరు విడచిపెట్టి వెళ్ళింది లేదు. కోడలూ కొత్తగా రావటమే. వీళ్ళిద్దరికూ పూర్వపరిచయం ఎక్కడిది ?

రెండుహృదయాలు, ఒకవైపు స్పర్ధా ఈర్ష్యలతోఉన్న రెండోవైపు శ్రద్ధార్చనలలో పరస్పర పరిచిత

ములేఅని, పరస్పర శ్రద్ధ ఈర్ష్య, అర్చన ఒకేభావనకు రెండుఅంచులు అని, ఋణము. ధనము రెండుకోనలని, రెంటిమధ్య ఒకే ఆకర్షణతత్వం ఉంటుందని వాళ్లకేం తెలుసు ?

## 30

ఇరువురూ ఒంటరిగా ఉన్నారు.

"జీజీ! నా సంగతి వారుచెప్పారా ?"

"చెప్పాడు. పెండ్లిసంగతికూడా చెప్పాడు."

"అతను చాలా నవ్వుతాడు. ఎప్పుడూ హాస్యమే అదేమి సరియైనమాటా ?"

"సరే! అతనిది సరియైన మాట నువ్వే నిక్కచ్చిమాట చెప్పు."

"జీజీ! ఏమీ లేదు. బలే పెళ్ళి ఎట్లా ? నువ్వే అరుగవు. నేను విధవను. విధవలకు పెళ్ళి వుతుందా ?... ఛి!" "పెండ్లి అంటే నే నువ్వు అసహ్యించుకొంటున్నావే మరేం జరిగింది ?"

"ఏముంది జీజీ! బిహారీ బాబు ఊరికినే"

"కట్టో చూడు! దాచితే లాభంలేదు. నాదగ్గర దాస్తావా నేను నీ జీజీని కాదు. జీజీతో నువ్వు నీమాట చెప్పవూ ?"

మేము ప్రతిజ్ఞచేసాము. అతను బ్రహ్మచారిగా వుండిపోతాడు. నేనిట్లాగే వుండిపోతాను. మేమిరువురమూ మా సంగతి ఆలోచించికోము. ఇతరుల పని

యనే ఆలోచిస్తాను నాకు నువ్వు ఉన్నావు నీకు 'వారు' ఉన్నారు. వారేనాకు చదువు చెప్పింది. నాకేం తెలుసు చదివించక పోతే నిన్ను నేను తెలుసుకో గలనా? బిహారీ తనంతట తాను సుఖంగా ఉండలేడు. బిహారీ ప్రపంచములో విహారానికే. ఆతను ఒక్కరి కొరకు గాదు - ప్రపంచ మంతటి కొరకు! నేను అది చూసే అతని చేత ప్రతిజ్ఞ చేయించాను. అంతే జరిగింది - దాన్ని బిహారీ వివాహమన్నా సరే మరేమన్నా సరే!"

"ఈ అద్భుతమైన విషయం నీకెట్లా తట్టింది. కట్లో!"

"ఇందులో అద్భుతం ఏముంది జీజీ! బిహారీ బాబును చూచి ఇతని ఆత్మ ఒక ఆశ్రయాన్ని పొంది, విశ్వకల్యాణ మార్గాల వ్యాప్తమైపోవాలి అనిపించింది. అతడా ఆశ్రయాన్ని కోరుతూఉన్నాడు. నన్ను నేనడిగాను. "నేను ఆశ్రయాన్ని కాగలనా?" అని. మనస్సు చెప్పింది "ఎందుకు కాగూడదు? అని అందుకని ధైర్యంచేసి నేనతనితో యీ విషయం చెప్పి వేసాను."

"నువ్వీ ఆత్మలను చదవటం ఎక్కడ నేర్చుకున్నావు. నువ్వు చాలా తెలివిగలదానివిగా ఉన్నావే?"

"జీజీ! నువ్వు ఎగతాళిచేస్తున్నావు. ఆత్మ అందరిదీ చదవటం సాధ్యమా? ఇది ఒకళ్లు చెప్పేదికాదు. ఒకళ్లు నేర్చుకునేదికాదు. బిహారీబాబు నాకు స్పష్టంగా కనపడ్డాడు. అతన్ని నేను అచ్చు అక్షరాలులా చదివేసాను."

"అయితే ఈ పెళ్ళి యెట్లాజరిగింది? అతను పెళ్ళి అయిందంటున్నాడు. నువ్వు మెచ్చుకల్లావని కూడా అంటున్నాడు."

"జీజీ! అతను ప్రతిమాట అట్లాగే నవ్వుతూ చెప్తాడు. ప్రజలుదాన్ని పెళ్ళిఅని ఎందుకనాలి. ఆ! అతను నాజీవితంలో నేనతని జీవితంలో కలిసిపోయి నాము. ఇదినిజం మేము ఒకేప్రతిజ్ఞలో బద్ధులమైపోయి నాము, నావల్ల అతనిజీవితము, అతనివల్ల నాజీవితము పూర్ణదశను పొందుతాయి. అతనివల్ల, నేనే కాకిని అయికూడా ఏ కాకిని కాదు, మేము పరస్పరంఅయి, అందరి వాళ్ళంకా గోరుతున్నాము. నేను అతనికొరకు చచ్చిపోతాను, అతను నాకొరకు బలిఔతాడు...కాని జీజీ! నన్ను నువ్వు కేవలం పిచ్చిదానిగా చూస్తున్నావు. నేను పూర్తిగా పిచ్చిదాన్నికాదు. నీ అంతనాకు తెలి యదు. కాని అందుకనే నువ్వు నన్ను తక్కువగా చూస్తావా! వద్దు వద్దు. నామీద నువ్వుకోపగించకు సరే! జీజీ! మా ఇంటికి పద. నీకు రొట్టెలు తయారు చేయటం ఏమిచేతవుతుంది? ఎప్పుడు చేశావు నువ్వు ఇటువంటి పనులు? నువ్వు కూర్చొ మాటాడుతూ వుండు, నేను తయారు చేస్తాను. నీతో చెప్పివుండరు. నువ్వు ఇవ్వాళ మా ఇంట్లోనే భోంచెయ్యాలి. ఆ! ఇం కో విషయం... ఆశీర్వాదం! ఆశీర్వదించావా నువ్వు? —ఇప్పుడాశీర్వదించాలి. ముందు ఆశీర్వదిస్తేనేగాని రొట్టెదొరకదు."

కట్టో వాక్చాతుర్యం ముందర తప్పించుకోటం చాల కష్టం. తానే ప్రశ్నిస్తూ తానే జవాబు చెప్తూ వుంటుంది. గరిమ ఆమె సంభాషణా విధానానికి ఆశ్చ ర్యం చెందింది. మాటలు బహుచమత్కారంగా నొచ్చ కుండా చెప్తుతోంది.

ఆశీర్వాదాలు ఇవ్వటం పుచ్చుకోటం, గరిమ ఏ 'కోడ్'లోనూ నేర్చుకోలేదు. ఆశీర్వాదాలు ఇవ్వా లనే ఉబలాటమూ లేదు – కాని

"జీజీ! మాటాడవేమి? ఇటుచూడు నేను మోక రిల్లి కూచుంటాను. పాదాలమీద వ్రాలుతాను అప్పుడు తల్లికి వలె నాశీర్షాన్ని స్పృశించు నేను లేస్తాను. అప్పుడు నన్ను నీకౌగిటిలోకి తీసుకో. కానిచూడు. నిండైన మనసుతో చెయ్యాలి లేకపోతే నేను తిరిగి కస రత్తులు చెయ్యవలసి వస్తుంది. సరిగా నేచెప్పినట్లు చెయ్యకపోతే తిరిగి తిరిగి చేయిస్తాను."

కట్టో పెద్ద పెద్ద మాటలు మాటాడుతుంది. అయినా పసితనం అందులో నుంచిపోదు. గరిమ తన్ను గూర్చి 'తల్లి' అనేమాటవింది. ఆమెహృదయం కరగింది. నిజంగా కట్టోను కవుగలించుకోవాలి అనుకుంది, ఈ పిల్లదగ్గిఆ హారం పనికిరాదు. తనలో ప్రసుప్తమై ఉన్నమాతృత్వభావాన్ని మధుర వాక్కులతో రేపింది. ధాన నేను కంఠస్వరంతో పాషాణాల్ని ద్రవింప చేసాడు. పసిపిల్లలు ఎన్నోసార్లు క్రూర మనుష్యుల్ని హింస్ర జంతువుల్ని తమ దీనస్వరాలతో మార్చివేశారు. ఆకులు. అవ్యక్తంగా పరమాత్మ కారిన్యాన్ని పోగొట్టు

తున్నాయి. కట్టా వాగ్విన్యాసంతో గరిమ మారటంతో ఆశ్చర్యమేమిటి మాతృత్వ గౌరవంతో, స్నిగ్ధహృదయంలో గరిమ అంది "కట్టా ... నేను"

కాని అప్పటికే కట్టా మోకరిల్లి కూచుంది. మస్తకం పాదాలమీద వ్రాల్చింది - కాళ్ళులాగుకుని గరిమ కరగి ప్రవహించిపోయింది.

స్నేహార్ద్రి కంపితమైన ధ్వనితో గరిమఅన్నది "ఓ కట్టా!"

కంఠం డగ్గుత్తికపడింది - చేతితో మస్తకాన్ని స్పృశించింది. రెండుచేతులతో లేవనెత్తి కవుగిలించుకుంది.

ఆశ్లేషంనుంచి విడివడి కట్టా "నా జీజీ! నువ్వెంతమంచిదానివి! మా ఇంటికిరావూ!" అంది. గరిమ కన్నీళ్ళెప్పుడు ఎరుగదు. కాని ఇప్పుడవి సుఖప్రదాలుగానే ఉన్నాయి ఆమెకు. వర్షంలో తడిసిన ఉద్యానంలో ఆమె మరింత హర్షోత్ఫుల్ల అయింది.

"కట్టా! నువ్వు నా వెంటఉండు. నువ్వు నా వెంటవస్తే ఎంతో బావుంటుంది. కట్టాలాగానే వుండాలి. అందరూ నిన్ను ప్రేమిస్తారు. నిన్ను ప్రేమించకపోతే ఎవరిని ప్రేమిస్తారు?"

"నేను వెంటవస్తానుగా! జీజీ ఎంత అనిష్టకరమైనమాట ఢంటున్నావు. ఈ ఊరువదలి ఎక్కడికన్నా వస్తే కొమ్మనువిడిసినవువ్వంతీరునా అవుతుంది బ్రతుకు మీ ఇంట్లో నాబోటి పల్లెటూరిపిల్ల ఏమంతరాణిస్తుంది? జీజీ! నాకు స్థావరమేఇది - ఈ నేరేడుచెట్టు

ఇల్లే ... కాని ఎందుకలట్లానాన్నవు ... అతను చెప్పాడా ?"

"అతను చెప్పలేదు. అతను ఎందుకు చెప్పు తాడు. కాని చెప్పమంటే చెప్పిచూస్తాను."

"వద్దువద్దు."

"తప్పకుండా చెప్తారు. ఎందుకు భయపడ తావు."

"అతను చెప్పినా, నేనురాను."

"అప్పుడు నువ్వు తప్పకుండా నే వస్తావు" కొం చెంసేపు ఇంకా సంభాషణ జరిగింది. ఆ మాటలన్నీ విని పించటానికి వీల్లేదు. కట్లో తన జీజీని బలవంత పెట్టింది.

"ఇంటికిపద రొట్టెను. నేను తయారుచేస్తుంటే నువ్వు చూస్తూ కబుర్లు చెప్తూ ఉందువుకాని." అది ఎన్నటికీ జరుగదు. గరిమ చూస్తూకూచుంటుందా ? చేతనైనంత సహాయం చేస్తుంది. కాని

"కాని ! నేనిప్పుడే వస్తున్నాను. నువ్వుపద... నేను...కొంచెం..."

చాలు చాలు కట్లోత్తో పైన చెప్పనక్కర్లేదు. ఆమెకు అర్థమై పోయింది. ఆమె వెళ్ళిపోతుంది. పరు గెత్తుకొని పోతూంది. మీ ఇరువురి మధ్య ఆమె ఎవరు ?

ఒక్కగంతు వేసివెళ్లింది – కాని జీజీ రాదేమో అందుకని వెళ్తూ వెళ్తూ జ్ఞాపకం చేసి మరీ వెళ్ళింది.

"రావాలి సుమా ! నామీద..."

"ఆ ! తప్పకుండా !"

కట్టా వెళ్ళిపోయింది. ఎంతసేపైనా మాటాడు కోవచ్చు - కాని అక్కడకు వెళ్ళాలి.

నవవధువు వరుణ్ణి వెదకింది —

"కట్టా ! నాతో వస్తే ఏముంది"

ఏమిటి కట్టా మళ్ళీ కట్టాయేనా ... ఏదో విసుక్కొంది విని సట్లుగా ప్రశ్న ముఖం పెట్టాడు.

"ఏం వినపడ లేదా — కట్టాను ఎరుగరూ !"

"ఏమిటి కట్టా — అయితే ?"

"ఆమె నాతో ఢిల్లీ వస్తే ఏం ?"

"వద్దు" అని దృఢంగా అన్నాడు.

"వద్దూ ?"

"ఉహుం. వద్దు. విషాన్ని దగ్గిఱ ఉంచుకోదలిస్తే ఉంచుకో. నేను చెప్పను. కట్టాను నీదగ్గిఱ లేదా మన దగ్గిఱ ఉంచికోమని నేనెన్నటికీ సలహా ఇవ్వను. తెలిసిందా."

తెలిసీ తెలియనట్లైంది. ఇంకా సంభాషణను పొడిగించడం మంచిది కాదనుకుంది.

తరువాత సంయమితరూపంతో, పరస్పరం ప్రేమాభివాదాలు జరిగాయి. సంయమం కట్టుబాటువచ్చి ప్రేమాలాపాన్ని కట్టిపెట్టాయి. గరిమ కట్టా ఇంటికి వెళ్ళింది.

కూర తయారవుతోంది. పూరీ తయారు చెయ్యాలి. పులుసు అవుతోంది. జీజీ హడావుడిలో పిండిమాట మరిచేపోయింది. పళ్ళోటా పడివుంది ఊరికే. వెళ్ళిపోతోంది పిండికోసం.

"ఏమిటి ? ఏమిటి ?"

కట్టో నవ్వుతూ నవ్వుతూ చెప్పింది.

"అంతా అయింది. పిండి తేనేలేదు. పెండ్లికి సరిపడ సామాను తయారయింది- పెండ్లికొడుకే లేడు."

"నేను తెస్తున్నానులే"

"వద్దువద్దు"

"ఎక్కడుంది ?"

"కుండలోవుంది."

గరిమ పిండి తేటానికి పోయింది. కట్టో కూర సంగతి చూస్తోంది. కూర తిప్పుతూ తిప్పుతూ, "చూశావు. ఇదేమిటో ?"

"చూను అడుగంటుతోంది."

"— దింపేస్తున్నాను."

"దీనిదుంప తెగ"

దింపబోయి అక్కడేవుంచింది. కట్టో "కొంచెం చాలు"

ఒక్కొక్క గుప్పెడు పిండివేస్తూ అడుగుతూవచ్చింది. ఆకాశరంగు చీరముందుభాగం మోచెయ్యి

దాకా చేతులు తెల్లబడిపోయాయి జీజీకి పొడరుపూసు కొన్నట్లుయింది.

"జీజీ యిదేమిటి? అందరినీ నవ్వించాలనుకు న్నావా? లేక చేతిరంగు చీరరంగు నచ్చలేదా?"

"అను. ఏంచేస్తాను"

"ఏంచేస్తావు. ఊరో. నన్ను ఆజ్ఞాపించు. అందరికీ ప్రత్యేక ప్రత్యేక పనులుంటాయి. ఒకరిపని ఒకరు చేస్తే గందరగోళం అవుతుంది. నీకు నీపనే బాగుంటుంది. పప్పు ఉప్పు పని నీదికాదు. నాది నన్ను చెయ్యనీ. చూడటం చెప్పటం, పురమాయించటం పని నీది."

"కాదు. నేను బాగా పూరీతయారుచేస్తాను."

రోజూ సంగతి చెప్పటంలేదు. రోజూ నిజంగా చెయ్యనూలేదు. కాని నేడు పనిచెయ్యకుండా వుండలేదు. తప్పకుండా కొన్నిపూరీలు — తనచీరె, చెయ్యి ఖరాబు చేసుకుంటుంది. చెమటవచ్చినా, కళ్ళల్లో నీళ్ళువచ్చినా కట్టోకు ఎంత అభ్యంతరం ఉన్నా సరే సహాయం పేరుతో గరిమకట్టోకు పని పెట్టింపు చేస్తోంది. తనపనే కాకుండా గరిమ పనికూడా కనిపెట్టు తూవుండాలి. కాని రోజూ ఇట్లా వుంటే బాగుండు ననుకుంటోంది. తన్ను ప్రేమించేవాళ్లు ఎవరైనా దొరికితే సింహాసనంమీద కూచోపెట్టి ఇరవై నాలుగు గంటలు చాకిరీ చేస్తుంది. అందులోనే తనజన్మకు కృతార్థతను గడించుకుంటుంది. ఇవ్వాళకట్టోకుఉన్న సంతోషం అపారం!

మొత్తంమీద వంట తయారయింది. కట్టో అమ్మకూడ వచ్చింది. ఎంత దివ్యమైన గాజులు! అదృష్ట వంతురాలివికమ్మా. పుత్రుల్ని కను. మొదలైన ఆశీస్సులను కురిపించింది— వాటితోపాటు సాష్టాంగ నవ్వులుకూడా!

ఆమె గరిమచేస్తున్న తెలిసీ తెలియని పనులకు లోలోపల మురిసిపోతూంది. చివరకు సత్యనుకూడా పలకరించివచ్చింది. సత్య ఆమెమాటలకు కేవలం 'ఆ, ఊ' లు తప్ప వేరే జవాబివ్వటంలేదు. అందుచేత ఆమె ఉత్సాహం సన్నగిలిపోయింది. గరిమ సిగ్గుతో అసలే మాటాడలేదు. కట్టోకు తనపనితోనే సరిపోతోంది! ఆమెముఖంనుంచి ఒక్క మాటకూడా లేదు. పని నిరంతరాయంగా సాగిపోతోంది. వడ్డిస్తున్నా పనిలోధ్యాసే. ఎవరు ఏమీ మాట్లాడటంలేదు. అందరి నిశ్శబ్దాలు కూడిన యీవేళ నీరసంగావుండక ఎట్లావుంటుంది— అందుచేత—

*　　　　*　　　　*

"జీజీ! కూర్చో"

"నువ్వుకూడ కూర్చో"

"నేను తరువాత తింటాను. అంతా సర్దుకోవాలి కదూ"

"ముందుసర్దుకో నేనూ తరువాతనే తింటాను"

"అట్ల కాదు. నీవు అతిథివి. జీజీ!"

"బలే అతిథిని, బలేజీజీని...కాస్తపని"

"కాదు కాదు నేను పళ్లెంలో వడ్డించానుకూడా"

"నవ్విస్తు ఉండనీ. చల్లగా వుంచేసుట్టుకు ఏమి కరుస్తుందా కొట్టుతుందా ?"

కట్టో ఓడిపోయింది కట్టో అంది — "సరే! దబ్బునే సర్దివస్తాను. నిన్ను ఆ ప్టేసేపు ఆకలితో కూర్చోనివ్వను. కాని సర్దటంలో కూడా సహాయంచెయ్యి."

"చెప్పు. చెప్పు"

అప్పుడిద్దరూ కలిసి సర్దుకున్నారు. సగంపని కట్టో చేసింది. తక్కిన్నసగం గరిమకు చెప్పి చేయించింది. ఆలస్యమైనా ఆలస్యంఅని అనిపించుకోలేదు. తొందరగా అయిపోయినట్లే అనిపించింది.

ఇద్దరు స్నేహితురాండ్రు భోంచేసారు. పక్కిం లోకి వండిన కూరలతో పాటు, గద్దించటం బ్రతిమాలటం, బలవంతంచేయటం, నవ్వుకోటం, మొదలైనకూరలుకూడా వచ్చాయి ప్రీతిమూలాన భోజనము చాలా రుచికరంగా వుంది. ఆకూరలు కట్టో చేసింది. ఈకూరలు జాస్తి గరిమ తయారుచేసింది. పట్నంలో ఉండి గిరుల మధ్యఉంచబడిన మట్టి ముద్దలా అయిపోయింది. గరిమ కట్టోదగ్గరకు రావటంతోటే, ఆగీతలు, ఆ రేఖలు, తొలగిపోయాయి. అణచబడిన సంకుచితమైన ఉత్సాహము పొంగింది, విశాలమైంది అందుచేతనే ఆమె కట్టోతో అంత సరసాలాడకలిగింది.

స్నేహితుల ఈ సరసాలలో మనం జోక్యం కలిగించుకోనద్దు. వాళ్లేమేమి చేసుకుంటారో మనకెందుకు? మన జాడ తెలిస్తే వాళ్లు మానేస్తారు. అప్పుడు ప్రపంచానికే నష్టంమరి.

# 3౨

కాని రోజులు ఒకవిధంగా జరుగవు. 'గడచి బ్రతికినవారు లోకమున లేరు.' కాలం పరిభ్రమిస్తూ వుంటుంది. క్రొత్తలు పాతగిల్లిపోతూవుంటేసరి క్రొత్తలు వస్తూవుంటాయి. పాతది చచ్చిపోయి నూత్నరూపంలో మళ్లీవస్తె రానూ వచ్చు. విద్వాంసులుకు కూడా ఈ మర్మం ఏమిటో అంతుపట్టలేదు. వాళ్ళుమాత్రమే అంతరించిపొయ్యారు. గవేషిస్తున్నారు.నశించిపోతున్నారు. కాని లభ్యమానం కానడంలేదు. అట్టిదానిని మనమేం తెలుసుకోగలం ? మనమంత శ్రమపడలేం, ఆ శ్రమలోనే నశించిపోలేం; దానికోసమే జీవితాన్ని ఖర్చుపెట్టలేం; మనం అందుకే ఒకశబ్దంలో అన్నాము. "పరమాత్మ" అని. మనం తృప్తిపడ్డాం. కాని వెదకటంలో విసుగులేనివాళ్లున్నారు. మేం పొందిగాని వదలమంటూరు, వాళ్లను ప్రశంసిస్తాము; వాళ్లకు ధన్యవాదాలు చెప్తాము, నమస్కరిస్తాము. శ్రద్ధతో వాళ్లను "నాస్తికు'' లంటాము. కాని ఒక్కటి కోర్తాము చివరిదాకా మీకు లభించనప్పుడు మాతోపాటు "పరమాత్మ" అనమని. మీరు అనుకొన్నది దొరికితే, ఉన్న నిఘంటువు లన్నింటిలోనుంచి "పరమాత్మ'' శబ్దాన్ని తొలగిస్తామని పూచీకూడా పడుతాము.

మనం దారితప్పాము. కట్టో గరిమల వృత్తాంతానికి 'పరమాత్మ' తత్వానికీ ఏమీ అంతసంబంధం లేదు. క్రొత్తపాతల సంగతిమాత్రమే మనకు కావాలి

సింది. గ్రామంమీదఉండే అభిరుచి గరిమకు తగ్గటం ప్రారంభించింది. కట్టోనుచూసినా అంతఆకర్షణ కల గడంలేదు. వార్తాపత్రికల అవసరం కనబడుతోంది.— పుస్తకాలైనా లేవు! పల్లెటూరి స్త్రీలు— ఎంత కలిసి మెలిసి మాటాడితేమట్టుకు—వాళ్లతో మనస్సు కల వదు. సరిగా కూర్చోరు — మాటాడరు - మాటాడితే అర్థం చేసుకోరు. మాట అర్థంకూడా చేసుకోలేదు. అటు వంటివాళ్ళతో రెండునిముషాలు ఎట్లా ప్రస్తావించడం? ఢిల్లీలో లత ఉంది, జాహ్నవి ఉంది, అప్పుడప్పుడూ తన ఇంటికి వస్తూవుండేవాళ్ళు అప్పుడప్పుడూ తాను వెళ్తూ వుండేది. వాళ్ళతో ప్రపంచ సంగతులు, తెలివికి సంబంధించిన విషయాలు ప్రసావిస్తూవుండేది. ఇక్క డ దేమీ లేదు. ప్రపంచంసంగతే పట్టదు. కేవలం రొట్టె కుంపటి మొగుడు—ఇంకా పరస్పరం 'నువ్వు' "నేను' అనుకోటం. అక్కడ ఎక్కడచూసినా ఉద్యానవనాలు మనసైతేచాలు కమ్మనిగాలి పీల్చవచ్చు — ఇక్కడ గాలికూడా శుభ్రంగావుండదు - కేవలం కంపు—ఆక్! కార్బన్- ఆరోగ్యానికి భంగం - చూడు తాను ఎట్లా వసివాడిపోయిందో!

సారాంశం ఏమిటంటే, గ్రామంకొత్త ప్రాతపడే టప్పటికే యీ దోషాలన్నీ ప్రత్యక్షమైనాయి.

ఒకరోజు బాబునుంచి ఉత్తరంకూడా వచ్చింది.

"సత్య! పల్లెటూరిలోఉండి చాలారోజులైంది. మనసైతే ఇక్కడకు రావాలిసింది. గరిమమనస్సు అక్కడ ఇంకాబాగా అతుక్కోనకపోతే ఆశ్చర్య పడ

వల్లసిన పనిలేదు. అది ఎప్పుడూ అట్టువంటిచోట ఉండి ఎరుగదు. నాకు వేరేమీ లేదు. ఆరోగ్యం చెడుతుందనే భయంతప్ప. ఆరోగ్యం ముందు. ఇతరవిషయాలు తరువాత. ఎప్పుడు వస్తున్నావో వ్రాయి. బండి పంపిస్తాను. తొందరగా రండి. గరిమ కులాసా అనుకుంటాను. నా ప్రేమను చెప్పు, నాకు ఉత్తరం వ్రాస్తూ ఉండటం ఒక్కసారిగా మరచిపోవద్దని చెప్పు. అందరూ కులాసా.

అవసరమైతే వచ్చేసంగతి భగనీవద్దనూళ్లు టెలిగ్రామ్ ఇవ్వండి.

భ. ద."

సత్య వెళ్ళాలనే సంకల్పంలోనే ఉన్నాడు. గరిమ ఆరోగ్యాన్నిగూర్చి ఆతడు నిశ్చింతగా వుండ తలచుకోలేదు. ఎండ లెక్కువగా ఉన్నాయని, గాలి మార్చాలిఅని గరిమ చెప్పింది. నీళ్ళుకూడా సరిపడలేదు. ఒంటరితనం ఎక్కువగా ఫీలు చేస్తోంది. సొసయిటీ లేదు. మెదడుకు పనిలేదు. బహుశః అందుచేతనే అట్లావుండి వుండవచ్చు. గరిమ ఇట్లాకూడా చెప్పింది. "నాకొరకేమి అక్కర్లేదు. మీకు ఎక్కడ సంతోషమైనా నాక్కూ అక్కడే సంతోషంగా వుంటుంది. మీకు పల్లెటూరు నచ్చితే నాకుమాత్రమేమి ?"

ఈవిధమైన తర్కము కార్యసిద్ధిని త్వరగా యిస్తుంది. అశ్రుసించనమునకు బదులు ప్రయోగం ఇట్లా మాట్లాడటం హృదయాన్ని స్వాధీనం చేసుకోటంలో, ద్రవింపచేయటంలో అంతకంటె నేర్పరైన పద్ధతి. వెళ్ళాలని అనుకుంటూనే వున్నాడు. ఇంతలోకి

ఈఉత్తరం వచ్చింది. దర్వాజా తెరచి స్వాగతవచనాలు పలికిన క్లైండి.

వెళ్ళటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి చురుకుగా. ట్రంకులు సర్దుకోటం మొదలైనవి హడా వుడి చేస్తున్నాయి, కొత్తకోడలు వెళుతోంది అన్న సంగతి యీ అమ్మనుంచి ఆ అమ్మకు ఆ అమ్మనుంచి ఆఅమ్మకు, ఇట్లాగే రెక్కలుకట్టుకొని ఊరంతా తెలిసి పోయింది.

ఈ సందర్భంలోనే కట్టోకుకూడా తెలిసింది.

"జీజీవెళ్ళుతోంది! అతనూవెళ్ళుతున్నాడు!"

తాను చాలారోజులనుంచి అక్కడకు వెళ్లకపో యినా, జీజీ ఎక్కువగా మాటాడకపోయినా తాను ఇప్పుడు వెళ్లకతప్పదు.

చేరింది! చాలా సామాను సర్ద వలసి వుంది. బట్టలు కొన్ని మాసివున్నాయి. వాటిని వేరేమూటగా కట్టాలి. కొన్ని చాకలింటినుంచి వచ్చినాయి బట్టలు వాటిని గ్రంకుల్లో జాగ్రత్తచెయ్యాలి. ఎవ్వి యే ట్రం కులో పెట్టాలో అదికూడా జాగ్రత్తగా చూడాలి. ఈ పనఅంతాచూసి కట్టో మొదలకుండా నుంచింది. అవ కాశంచూచి జీజీతో మాటాడాలిఅని. ఇంకా చాలాపని మిగిలివుంది. తలయెత్తిచూడటానికైనా సావకాశం లేదు. ఎప్పుడు తీరిక చిక్కుతుందో తెలియదు.

గరిమ మనస్సును అడుగుతారా? తన్ను తాను నిందించుకుంటోంది. చూసికూడా చూడనట్లుగా వుండ టం, చాలా తప్పుచేస్తున్నానని అనుకుంటోంది. కాని

నేరాన్ని పోగొట్టుకోటం ఆ స్వభావానికి కష్టమైనపని. అందుకని తనమనస్సును కప్పిపుచ్చటానికి, నిజంగానే కట్టోను చూడనట్లు, బట్టల మూటలోనే వ్యగ్రురాలై పోయింది.

చివరకు కట్టో అంది "జీజీ!"

ఇప్పుడు తానింకా అభినయించడం పడదు.

"కట్టో"

"జీజీ! వెళ్ళుతున్నావా?"

"ఆ!"

"వస్తావా! ఎప్పుడువస్తావు?"

"అది వారికి తెలుసు"

"రావూ?"

"నేనేమిచెప్తాను కట్టో"

"రావాలనుకుంటే రాలేవా జీజీ. ఇంకా కొన్ని రోజులుండలేవు."

"కట్టో! మనస్కరించడంలేదు. ఎవరూమాటాడేవాళ్లేరు. నేనిటువంటిచోటు ఎప్పుడూలేను."

"అయిదారు రోజులనుంచి నేను రాలేదు నాకేం తెలుసు నీకుతోచడంలేదని. లేకపోతే నువ్వయినా కబురంపాలిసింది. శిరసావహించి వచ్చేదాన్ని. జీజీ కట్టోమీద కోపగించుకుంటే, కట్టో ఏంచేస్తుంది.

జీజీ ఏమీ మాటాడలేకపోయింది. 'అవును, కాదు' అనలేకపోయింది. కట్టో నమ్రురాలైపోతుంది. నమ్రతఉన్నచోట ప్రేమించకుండా వుండటం కష్టమవుతుంది. ఇట్లా జాలిగా వెంబడిపడుతుంటే కట్టోను

ప్రేమించకుండా వుండటం కష్టమైపోతుంది అదే స్థితిలో గరిమవుంది.

"జీజీ! కోపంగావుంటే చెప్పు. ఏదైనా తప్పుచేస్తే చెప్పు. ముందెప్పుడూ చెయ్యను. చూడు అని కళ్ళ లోకిచూసి, పాదాలకుమ్రొక్కి చేతులు జోడించి అంది "జరిగినదానికి క్షమించు ... క్షమించావుకదూ? జీజీ? కట్టో యొక్క చెడ్డతనాన్ని మనసుకు పట్టించుకుంటే మంచిదికాదు. నీమనస్సుకూ సుఖంవుండదు. నా సంగతి అడుగనే అక్కర్లేదు."

గరిమ రెండుచేతులూ కట్టో భుజస్కంధాలమీద ఆన్చింది.

"బట్టలు..." అంటూ సత్యా లోపలికివచ్చాడు. చూసి చకితుడయినాడు కట్టో యెదుటబడటం అతనికి ప్రాణాంతకంగా వుంటోంది. కట్టో చూసింది — సత్యా.

ఆమె పాదాలుతాకి అడిగింది "నీవు వెళుతున్నావా. జీజీ ఎప్పుడు తిరిగివస్తుంది?"

"చెప్పలేను"

"బొత్తిగా చెప్పలేవా!"

"ఎట్లా చెప్పగలను?"

"అయితే ఎప్పుడు పునర్దర్శనం— కట్టో ఏమన్నా అనివుంటే క్షమించాలి, కట్టోకు చదువుచెప్పి ఇప్పుడు దానిజేత పనేచేయుంచుకోరా?"

మాష్టరుగారు మౌనం!

"అయితే నేను వెళుతున్నాను. జీజీ నాకు ఉత్తరంవ్రాస్తూవుండవలసింది. నీకు వీలైనప్పుడు ఇక్క

డకు రావాలిసింది. మీరిరువురు క్షమించండి. కట్టో చాలా నేరాలు చేసివుంటుంది. చాల మూర్ఖపు పిల్ల మీరిరువురూ సుఖంగా వుండండి. కట్టోను అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకుంటూ వుండండి. ఎందుకంటె కట్టో మిమ్మల్నెప్పుడూ మరచిపోదు.

కట్టో తిరిగి యిరువురకు నమస్కరించి, జెజని కవుగిలించుకొని వెళ్లిపోయింది.

సత్యా వస్తూవున్న దుఃఖాన్ని ఆపుకోటానికి, బట్టలు సర్దటం. పోగుచేయటం మొదలుపెట్టాడు.

"తొందరగా కానీ"

అశ్రువులను దాచవలసిన అవసరము గరిమకు లేదు అందుకని ఆమె చీరచెంగు తడుపుతూ నిలుచుంది.

# 33

గరిమా సత్యాకు, కట్టోబిహారీలకు పెళ్లిఅయిపోయింది. మా పనిగూడా దరిదాపుగా సాంతమైనట్లే - 21 వ శతాబ్దాన్ని అనుసరించి సంతానాన్ని గురించిన చింత మాకులేదు. అందుచేత ఆ విషయాన్ని గురించి మేము చెప్పదలచలేను.

సత్యా ఢిల్లీ చేరాడు - ఇల్లు విశాలంగా ఉంది. పంపు ఎలక్ట్రిసిటీఉంది. వసతులన్నీ చక్కగావున్నాయి,

ఇక ఢిల్లీలోనే వుండటం అవుతుంది.

బిహారీమీద బాబుకు నమ్మకంలేదు. అతను పక్కామనిషి అందుకని సత్యాను తనదగ్గిరే ఉంచాడు. తల్లిని మాడ తపడూర్ నుంచి పిలిపించాడు. తాతముత్తల ఇల్లువదల్లి

రావటానికి గునిసింది. ఆవిచారంతోనే ఆమె ఢిల్లీ చేరు కుంది. అక్కడనుంచే పరలోకయాత్రకూడా చేసింది. రెండు వారాల తరువాత గరిమతల్లికూడా దీర్ఘప్రయాణంచేసింది.

అప్పుడింటిలో పనిభారం గరిమపైన పడింది. బాగానే నిర్వహించింది నౌకర్లు బొకర్లుకూడా చాలా మంది ఉన్నారు. నౌకర్ల చేతపని చేయించుకోటం కూడా గరిమకు బాగానే చేతనయింది.

బాబుకూడా శిధిలశరీరుడైనాడు. బైటవ్యవహారం అంతా సత్యచూడవలసివస్తోంది. పాపం అతని ఆదర్శచింతనానికి ఆటంకం కలుగుతూ వుంది. అతనుపని చేస్తున్నాడు కాని లోపల ఈ దిగులుతోనే నిరుత్సాహంగా చేస్తూవున్నాడు.

బాబు అతనికి నచ్చజెప్పుతున్నాడు. ఆదర్శమును ఆరాధించడం అతని దృష్టిలో ఎంత మహత్తర విషయం అయినా, దాన్నిగూర్చి ఇతరులను నమ్మించటం చాలా కష్టం. జనం దృష్టిలో అదంతా నిర్లక్ష్యమునకు, అకర్మణ్యాతకు చిహ్నము. అసమర్ధతను చూస్తే ప్రపంచం మెచ్చుకోదు. అసమర్ధుడు తనకు తానూ సంతోషంగా వుండలేడు.

గరిమ కూడ వ్యంగ్యబాణాలు ప్రయోగిస్తూ వుంటే, పాపం తను ఏమీ అనలేదు. ఇంటిలో తన కున్న పెత్తనము, గరిమ అనుగ్రహించిన ప్రసాదం అనవచ్చు. గరిమ ఈసత్యాన్ని చాలా జాగ్రత్తగా తెలివి తేటలుతో వ్యక్తం చేస్తూ వుంటుంది.

బాబు కోర్టుపని ఇటీవల కాస్త ఎక్కువచేసాడు. ఫలితం ఏమిటంటే మెల్లిగా ఒక రోజున సత్య పేరు కూడ వకీళ్ళ జాబితాలో చేరింది.

మెల్లిగా దర్జా దర్పం హెచ్చినాయి. అధికారం చెలాయించడం కూడా హెచ్చయింది. ప్లీడరీలో పని తక్కువైన కొద్దీ ఎక్కువ డాబుసరి అవసరమైంది. కచ్చేరీలో కూర్చున్న ఖాళీ ఘంటలలో హృదయం ఆత్మదర్ప భావాలతో నిండిపోయి యింటికిరాగానే మూతతీసినట్లు, అవి నలువైపులా హంగామా చేస్తాయి.

బిహారీ పరీక్షయిచ్చి వెళ్లిపోయాడు. పరీక్ష ప్యాసయికూడా పదినెలలు కావచ్చింది. అతనిదగ్గిఱనుంచి ఒకటిరెండు ఉత్తరాలుమాత్రం వచ్చాయి. వాటిమీద అడ్రసుసరిగాలేదు. బాబు అతన్ని వెదకినా లాభంలేండ దని మెదలకుండా వూరుకున్నాడు.

బాబు గరిమనుకూడా విసుగుకుంటూఉన్నాడు. గరిమ ముసలితనాన్ని బట్టి విసుగుఎక్కువైందని గ్రహించింది. అందుకనే ఆమె ఆయన మాటను అంతగా పాటించటంలేదు.

ఇప్పుడిల్లంతా తన చేతిలోవుంది. ఇంటి విషయాలన్నీ తన చేతిలోవున్నాయి. ఇవన్నీ బాబుకు ఎట్లా బోధపరచటం? ఆయన ఇవన్నీ గ్రహించడు ఊరికే గరిమను చూసి విసుగుకుంటున్నాడు.

ఇటువంటి స్థితిలో బిహారీ ఎక్కడికి వెళ్ళిపోయాడు? అటు తిరిగి ఇటు తిరిగి బాబు బుద్ధికి అతనే

జ్ఞాపకం వస్తాడు. ఆయన అస్వస్థతగా కూడా వుంటు న్నాడు, దగ్గు బాధిస్తోంది. ఒళ్లంతా నొప్పులుగా వుం టోంది. సత్య నియమం ప్రకారం రోజుకు రెండు సార్లు వస్తాడు. అతనికిప్పుడు తీరిక లేదు. వకీలు, పది పనులు, తొంభై జంజాటాలు. బాబు జబ్బుగాకూడా వున్నాడా! ఆస్తిపాస్తులను గురించి కూడా అతనే చూసుకోవాలి. కాని బాబుకు అతను వందసార్లు రావాలని వుంటుంది. రెండు సార్లు కంటె వీలుచేసుకుని ఎప్పుడన్నా వచ్చాడా అన్ని విషయాలు, సైగలతో చెప్పివేస్తాడు, బాబు అర్థం అయినట్టే కళ్ళుమూసుకుంటాడు. కాని అర్థం కాదు. సత్య మళ్లీ మళ్ళీ రావాలని కోరుకుంటూ వుంటాడు.

బిహారీ ఎక్కడున్నాడు? బాబు అతనినే మరీ జ్ఞాపకం చేసుకుంటున్నాడు. కానివివశుడు - బిహారీ అయితే అతన్ని ఒక్కక్షణం కూడా విడిచి పెట్టడు - ప్లీడరీ ఏమన్నాకాని - ప్లీడరీ కూడా బాగానే చేసే వాడు-కాని ముసలివాడు ఏమిచేస్తాడు అతడు వివశుడు.

బిహారీ___?

అప్పుడే దుర్ఘటన సంభవించింది మోటారు ఢీకొట్టింది. ముసలివాడికి దెబ్బతగిలింది. సత్య తప్పించు కొన్నాడు. సత్య మామను ఆస్పత్రికి చేర్చియింటికి వచ్చాడు అతని వెనుకనే బిహారీ ఆస్పత్రి చేరాడు.

వృద్ధుడు గుర్తించాడు "వచ్చావా నాన్నా"

"వచ్చాను నాన్నా. — నయమైతే ఇంటికి పోదాం"

" బిహారీ లేదు. నొప్పి తీవ్రంగా వుంది. రోజులు పూర్తిఅయినాయి."

"లేదు. బాబూ నేను కట్రోను చూపిస్తాను. ఆమె మీకు సేవచేస్తుంది. మీకు కులాసాచిక్కుతుంది. కట్రో సేవచేయటంతప్ప ఇతరమేమీఎరుగదు. మీకు ఆరోగ్యముకూర్చి మరీ వదలుతుంది."

"ఎక్కడుంది? ఏక్కడుందినాన్నా."

సాయంత్రానికివస్తుంది. టెలిగ్రామ్ఇచ్చాను."

"నేను దాన్నిఎరుగను. నిన్నే ఎరుగుదును. నీ అభిమతం ఎప్పుడు చెడుగావుండదు."

"బాబూ! ఆమె దేవి."

"బిహారీ. నొప్పి అధికంగావుంది. మాటాడ నద్దు...మాటాడితే..." ఇక మాటసాగలేదు,

కట్రో వచ్చింది, కట్రో సేవచేసింది. ఆశీర్వాదాన్ని పొందింది. తెల్లని కనుబొమ్మలకిందనుంచి మధురమైన కన్నీళ్ళు జడిజడిగావచ్చాయి ... ఆయన స్వర్గస్థుడు!

మోటారు దిక్కుమాలినదారిలో చెడిపోయింది. జనంలో మెల్లిగా నడిచింది.

'అయ్యో!" సత్యఅన్నాడు "నేను ఆఖరుక్షణంలో బాబుదగ్గిర ఉండలేకపొయ్యాను."

## 3౪

మరుసటిరోజు ఒకఉత్తరం మిష్టర్ అడ్వకేటు నౌకరు ఇచ్చివెళ్ళాడు.

"అబ్బాయీ సత్యా! నాకిద్దరుపిల్లలు – బిహారీ, సత్యా, నీకు నేను గరిమనుఇచ్చాను. నేను దాన్ని అన్నిటికంటె మూల్యవంతమైన వస్తువుగా చూచుకున్నాను. మిగతాది బీహారీకి యిచ్చివెళ్ళుతున్నాను. మిష్టర్-అడ్వొకేటుదగ్గిర బ్యాంకులోఉన్న కర్రెంటు అకౌంటు కాక నాసంపత్తియొక్క యావద్వృత్తాంతమూ చక్కగా ఉంది. అతను సరిచేస్తాడు. బిహారీకి దాని అవసరం ఉండవచ్చు. నువ్వు సంపాదించుకోగలవు ప్రపంచంలో ఒకస్థానాన్ని నిర్మించుకోగలవు. కాని బిహారీ వాడుకోటానికి యిది చాలకపోవచ్చు,

సీ

భగవద్దయాళు

భగవద్దయాళు" చదివేటప్పటికి సత్యాకు కోపం వచ్చింది – మారిపోయాడు. అతనిప్పుడు ఈ ఇంటిలో కూడా వుండలేడు. బిహారీదానంమీాద అతడుండడు-ఒక్క క్షణంకూడా వుండడు. ఈ విషయమంతా గరిమకు చెప్పాడు. గరిమ ఇల్లు వదలిపెట్టటానికి సమ్మతించలేదు, కాని సత్యాయొక్క ఆత్మగౌరవం అంత చౌక అయిందికాదు. తక్షణం అతడు కొంతసామాను, వంద రూపాయలు తీసుకుని వెళ్ళిపోయాడు. ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. అక్కడ వుండటం ప్రారంభించాడు. మిష్టరు – అడ్వకేటుకు వ్రాసాడు.

" మి......అడ్వకేటు!

నేను చనిపోయిన భగవద్దయాళు ఆ స్థితిమీాద నుంచి నా అధికారాన్ని వదులుకుంటున్నాను. తమకు

ఇష్టమైనప్పుడు ఆఫీసుకు నన్ను పిలిపించుకొని అన్ని విషయములు తేల్చుకోవచ్చును. ఆయన కూతురు-అనగా నా భార్య ఇంకా ఆ ఇంట్లోనే వుంది. అందుకు నేను బాధ్యుడను కాను.

తమ

................

బిహారికి తెలిసింది. బిహారీ ద్వారా కట్టోకు తెలిసింది. ఇంటిజాడ తెలిసికున్నారు. ఒక మంచంమీద కూర్చొని సత్య ఆలోచనలో వున్నాడు. జీవితంమీద దృష్టి సారించి దాని నిగ్గు తేల్చుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. అతనికిజీవితంలోఎక్కడా మెట్టు దొరకడంలేదు.

చప్పుడైంది. కళ్లు తెరచాడు చూశాడు కట్టో! గరిమ రానిచోటికి — ఆశకల్పించే వ్యక్తి లేని చోటికి, తిరస్కృతమైన కట్టో! కట్టో! తనున్నచోటానికి వచ్చిందా?

"నీవు ఇల్లువదలి ఎందుకువచ్చావు?"

"అది నా ఇల్లుకాదు"

"ఎంతమాట అంటున్నావు"

"అది బిహారీది"

"అతను పరాయివాడా?"

"అవును. పరాయివాడే"

"ఛీ. ఛీ అట్లా అనకు"

"ఆ ఇంటినిండా పరాయివాళ్లే"

"ఏమిటి అంటున్నావు? ఖబర్దార్ అల్లాఅంటే నా జీజీని నువ్వు

" చాలాచూశాను నీ జీజీని "

అప్పుడు అతని కాళ్ళు పట్టుకున్నాడు.

" నా జీజీని నువ్వు ఏమీ అనకూడదు. నేను నీదానిని కాదా "

" కాదు నువ్వెవతివి కాదు. నా చేతుల్లో నిన్ను దూరంగా పారేశాను. మరి ఆ... "

" చాలు చాలు...నామీదఒట్టు నేను నీతో చెప్పుతున్నాను. ఆమె ఇంటినుంచి రాకపోవటం తప్పు కాదు. నువ్వే ఎందుకు వచ్చేశావు ?

" నేను సిగ్గులేకుండా వుంటానా ? "

" నా ప్రార్థన విను. చేతులు జోడిస్తున్నాను. "

" నేనీ పని చేయలేను. క్షమించుకట్లో "

" కాదు "

" కాదు "

" రావూ ? ",

" అన్నీ చేస్తాను ఇదితప్ప "

" మిగతా అన్నీ ? "

"మిగతా అన్నీ—ఇదితప్ప "

" నీమాట జ్ఞాపకం వుంచుకో " అని ఆమె అతని పాదాలు స్పృశించి చక్కా వెళ్లింది.

మరుసటిరోజు వచ్చింది. కలసై సాపాయం చెక్కముందర పెట్టింది.

" ఊహు-హు "

" మాటాడకు చెప్పావుకదా "

" కట్టో ! "

" చూడు నువ్వు ఓడిపోయావు "

" కట్టో ! నన్ను నరకంలో పడవెయ్యకు "

" ఇంత అసుభాన్ని నాలుకమీదకు రానీకు "

అతనికి రూపాయలు అవసరం ఉంది. అతను ఆమె మచ్చికలో పడిపోయాడు. ఇష్టంలేనట్టుగా అతి బాధమీద చివరకు అతను తీసుకున్నాడు. బిగుసుకుని కూర్చున్నతాను కట్టో పాదాలమీద పడాలి. రూపాయలు వుంచాడు.

కట్టోపాదాలుస్పృశించటానికి చేతులుసారించాడు.

సహించుకోలేని భావంతో వెంటనే కాళ్ళు వెనుకకులాగి ఆమె అన్నది. "అంజలించుతున్నాను. నన్ను మీరు లజ్జాన్వితగా చేయకండి"

"కట్టో ?"

"ఒకమంచి ఇల్లుతీసుకో. నాజీజీ అందులోవుంటుంది. ఇందులో ఎట్లావుంటుంది ?"

సత్య కొంతసేపటివరకు స్పృహలేనివాడుగా వింటూ వూరుకున్నాడు. హఠాత్తుగాఅన్నాడు. "నువ్వు చెప్పితే అంతాచేస్తాను. లేకపోతే"

ముఖంమీద వ్రేలువైచుకొని కట్టో అన్నది—

"మౌనం !"

సత్య నిశ్శబ్దం.

"జీజీకి నాసంగతి ఏమీచెప్పవద్దు- చెప్పు"

"ఏమీ చెప్పను."

సత్యను ఆపాదమస్తకం ద్రవీభూతుణ్ని చేసి కట్టో వెళ్ళిపోయింది.

"ఇప్పుడు ?"

కట్టో బిహారీని అడిగింది—

"ఇప్పుడు ?"

"మన యజ్ఞం ప్రారంభమౌతుంది."

"నన్నేమి చెయ్యమంటావు ?"

"పల్లెటూరికిపద. ఆడపిల్లలకు చదువుచెపుతూ దానీతో పొట్టపోసికోవాలి"

"నువ్వు ?"

"నేనూ పల్లెటూరికివచ్చి రైతునౌతాను."

"ఆ...మాఊళ్లోనే ?"

"కాదు-అక్కడనే దూరంగా అయినా దగ్గర గానే ! వేరుగా, అయినా ఒక్కటిగా.

ఎక్కడన్నా దూరగ్రామానికి వెళ్లుతాను."

స్వరం హఠాత్తుగా మారిపోయింది. గీచుకుని పోయినట్లయింది. జిజ్ఞాసవచ్చింది.

"ఈ రూపాయలు"

వీటిని ఎలాఉపయోగించాలో తెలియటంలేదు."

"ఇంతపర్యటనంలోను వీటి ఉపయోగం బోధ పడలేదు."

"కాదు. ముష్టివాళ్లకు ఇస్తాం——వాళ్ళు ఎక్కువౌతారు. రైతులకు ఇద్దాం. వాళ్ళు దీనిమీద అధార పడిపోతారు– ఎవరికిచ్చినా వాళ్ళు దీని నిషాలోపడిపోతారు. వళ్ళువంచి పని చేయటానికి వొప్పుకోరు. పరిశ్రే

ములు పెట్టితే ? ఇతర రోగాలువస్తాయి- యంత్రము, కేంద్రితసంపత్తి వీటికుండేజబ్బు లుండ నేడున్నాయి. ఉత్పత్తి ఖర్చు- శ్రమ కేంద్రితమైనచోట, శ్రమ యొక్క విలువతగ్గిపోతుంది. కేవలం ఉత్పత్తివిధానమే ప్రధానమైపోతుంది. అప్పుడుతిరిగి ఖర్చుకోసంమార్గాలు వెదకవలసివుంటుంది. నా దృష్టిలో ఈడబ్బే పెద్దగం దరగోళం- డబ్బు, పరిశ్రమయొక్క విలువను, గౌరవ మును పోగొట్టింది. దాన్ని కేవలం బాడుగవస్తువుగా తయారుచేసింది.

"అయితే ?"

"ఎవడిష్టంవచ్చినట్లు వాడు నాసంపదను తీసు కొనిపోనీ, ఇది నేనెప్పుడు సంపాదించాను ? ప్లీడర్లు ఎవరికి కావాలసింది వాళ్ళను తీసుకోమను. ఎవడు ముందర నాదగ్గిరకు దస్కతుకువస్తాడో వాడికే ఇచ్చివే స్తాను. నారైతువృత్తికి యీ డబ్బు ఆటంకమే - నాకు ఇదివుంటే రైతువృత్తి నచ్చుతుందా- భోగవిలాసం నచ్చుతుంది- లేదా ఉపన్యాసాలు ఇవ్వడం నచ్చు తుంది. అందువల్ల డబ్బుధ్యాసవుంటే లాభంలేదు. ఆడపిల్లలను చదివించటంగూర్చి ఆలోచించు నువ్వు- నేను నానాగలి, ఎద్దులసంగతి- ఏమంటావు ?"

"ఆ ! ఆ !"

"అయితే ?"

"మనము విడిపోవడమేనా ?"

"అవును."

"నమస్కారము"

బిహారీ రెండుచేతులు దగ్గరగాపెట్టి నమస్కరించిన కట్టో మస్తకంమీద చుంబించాడు. కట్టో ప్రణత భావంతో దాన్ని స్వీకరించింది. మరి ఇరువురూ తలోదారి అయినారు— పునర్మిలనమెప్పుడో!

స మా ప్త ము.